# భారతీయము





గ్రంథకర్త:
శేఖర్ దింటకుర్తి భాస్కరరాజు

# తొలిపలుకు

ఈ నాటకమున కెంతేని యుపోద్ఘాతము వ్రాయ నూహించితి, గాని కృత్యాద్యవస్థ కూడ దని విరమించితి. ఐనను యాచారమును విడువకూడదు గదా! మూఁడు నాలుగు వత్సరముల క్రితము నాజన్మ భూమి యగు నాంధ్రరాష్ట్రమున నున్నపుడు హరిదాసులు కొందరు భీమార్జున గర్వభంగ మను కథను జెప్పుచుండుట రెండు మూఁడు పర్యాయములు వినుట తటస్థించినది. అప్పు డీ కథను కొంచెము మార్పుతో దృశ్యప్రబ వ్రాయవలయు నని సంకల్పించుకొంటిని గాని యను కొన్నంత త్వరల చలేకపోతిని. తదుపరి యాంధ్రదేశమునకును నాకును ఋణము వుటయు, నైజామురాష్ట్రమున నేను స్థిరనివాస ప్రరచుకొనుటఁ కు తటస్థించుటవలన విశేష కాలయాపనము జరిగి పోయినది. ఇచ్చటగూడ నా హరిదాసులే ఆ కథనే జెప్పగా వినుట తట థ నాఁడు నేను సంకల్పించుకొన్న నాటకరచనోద్దేశ్యము పూర్తిగా నిప్పటికి నెరవేర్చుకో గల్గితిని. ఈ గాథ నేను తిలకించిన పురాణములం దెచ్చటను గానుపింపదు. హరిదాసుల పల్కులే యుపశ్రుతిగా దీసు కొని యికార్యమునకుఁ గడంగితిని. పండితవర్యులు న న్నేమిగా భావించి వను సరియే, చేతులు జోడించగలవాఁడనే గాని ఇద మిత్థ మని సిద్ధాంత మొనర్ప నన్వ్హడను. అయినను సరసులగు పండితు లట్టి వనికిఁ బూనుకొన రనియే నా సంపూర్ణ దృఢసంకల్పము. ఒకవేళ నట్టి కార్యోన్ము ఖులగుదురో సమాధానము జెప్పుటకు సంసిద్ధముగా నుంటిని. గర్వోక్తు లుకావని మాత్రము మనవిచేయుచున్నాను.

భారతకథా సంబంధ మగుటచే నీ నాటకమునకు 'భారతీయ' మను నామకరణ మొనర్చితిని.

స్వజాతిగాని, బాంధవులుగాని, ప్రాణమిత్రులుగాని నాకు యీరాష్ట్రములో నన్నాదరించి పుత్రప్రేమతో యీ మూఁడు నాలుగు సంవత్సరములనుండి అమిత వాత్సల్యముతోఁ జూచిన శ్రీ బిక్కసాని కోదండరామయ్య గారి కీ కృతి నొసంగి నా కృతజ్ఞత నెరవేర్చుకొంటిని.

ఈ నాటకమును శ్రీ కోదండరామయ్యగారి మనుమలు[illegible] త్రులును నగు శ్రీ శ్రీ తాళ్ళూరి వీరరాఘవయ్య చౌదరిగారే యచ్చు వేయించిరి. విద్యాభిమానులును, నిరంతరకృతానేక పరోపకారు లును నగు శ్రీ శ్రీ వీరరాఘవయ్య చౌదరిగారికి సర్వేశ్వరుఁడు సకల శ్రే యోభివృద్ధుల నొసంగి రక్షించుగాక.

ఈ కృతిసందర్భ మిట్టి దని చెప్పుటకొడనే దాని ప్రాశస్త్య మిట్టిదని గ్రహించి తమపుత్రునితోఁబాటు నాలుగువత్సరములనుండి నన్ను పోషిం చిన శ్రీమతి తాళ్ళూరి బసవమ్మగారికి అనేక వందనశతంబు లర్పించు చున్నాను. కార్యోత్సాహమునుబట్టి నే నిందుఁగల లక్షణవిషయంబుల నంతగా గమనింపలేదు గనుక లాక్షణికులు నన్ను మన్నింతురుగాక యని కోరుచున్నాను.

ఈ రాష్ట్రమునందు నా కన్నివిధముల తోడునీడగా నుండి నన్న మిత యాదరణముతో జూచుచుండిన శ్రీ తుపాకుల సీతయ్యగారికి సర్వధా కృతజ్ఞుడను.

ఈ నాటకప్రకటన నిమిత్తమై తగినంత యార్థికసహాయ మొసంగిన మ. రా. రా. శ్రీ మండవ వేంకటరత్నముగారికిని (కపిలేశ్వరపురం, కృష్ణాజిల్లా) తదితరమిత్రులకును భగవానుఁడు సర్వధా తోడుపడుగాక!

ఇందు పండితాభిప్రాయములు ప్రకటింపలేమికి నా శ్రేయోభి లాషులగు ఆ యా పండిత కవిజనంబులకు నమస్కారము లర్పించుచుంటిని.

ప్రమాది-చైత్రశు,
శ్రీరామనవమి,
29—3—39.

ఇట్లు విద్వజ్జనవిధేయుఁడు,
విద్యాశేఖర దింటకుర్తి భాస్కరరాజు,
మకాం: బుద్ధవరం.

ఓం.

# కృతిసమర్పణము

శ్రీ రాధాకుచచందనాహృతకృపా ♦ శీలుండు రాగాది సం
సారాంభోధివిపద్విముక్తు నుదయు ♦ స్వాంతుండు గోపాంగనా
చోరాద్యుఁడు యశోదప్రాకృతఫల ♦ శ్లోకుండు మాకృష్ణుఁడీ
ధీరు న్తాళ్లూరి రాఘవాఖ్యుని కృప ♦ దీర్ఘాయుగా జేయుతన్.

ఇతరరాష్ట్రమున నా ♦ హితవుగోరినతల్లి
కష్టము లెడదీయు ♦ కల్పవల్లి
ఆత్మజురీతి న ♦ న్నాదరించినయమ్మ
పరమబీదలకు దా ♦ బట్టుకొమ్మ
ధనధాన్యములనన్న ♦ దనివిదీర్చినమాత
గృహమొసంగిన సర్వ ♦ కృత్ప్రివూత
జీవనధన మిచ్చి ♦ జేరదీసిన యంబ
కోర్కె లొసంగెడి ♦ గుణకదంబ

యిట్టి గుణరాశి బసవాంబ ♦ నెలమి ముదము
దనరఁ గనినట్టి మాదు కో ♦ దండరామ
చౌదరి కొసంగితీ కృతి ♦ సరసమదిని
వెలయ తారార్కముగ భువి ♦ నలరుగాత!

ఇట్లు భవత్ శ్రేయోభిలాషి,
విద్యాశేఖర దింటకుర్తి భాస్కరరాజు,
బుద్ధవరం.

# ఈ నాటకమున వచ్చు పాత్రలు

| పురుషులు | స్త్రీలు |
| --- | --- |
| ధర్మరాజు | ద్రౌపది |
| భీమసేనుడు | సుభద్ర |
| అర్జునుడు | రుక్మిణి |
| నకులుడు | సత్యభామ |
| సహదేవుడు | మోహిని |
| వ్యాసుడు | జయ |
| విదురుడు | కుంతి |
| వృషకేతుడు | |
| మేఘవర్ణుడు | |
| నారదుడు | |
| శ్రీకృష్ణుడు | |
| దాసు | |
| సేవకుడు | |

సందర్భానుసారముగా మఱికొందరు.

# భారతీయము

## నాంది

శ్రీలోలుండు కృపాలవాలుఁడు దయాశీలుండు గోపాంగనా
కేళీలోలుడు రాధికాకుచతటీకీర్ణోత్తమాంగుండు స
ద్భాలుం డాశ్రితపోషణుండు సుగుణవ్యాపారదక్షుండు గో
పాలగ్రామణి బ్రోచు భక్తతతి నంభావించి యెవ్వేళలన్ !

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు

నటీ! యేమిచేయుచుంటివో ? ఒక్కపరి యిటు రమ్ము.

నటి

ఆర్యా ! వందనము. ఏమి యాజ్ఞ ?

సూత్రధారుఁడు

ప్రియతమా ! సరసులగు సభాస్తారులెల్లరు 'నే డొక్క సరస విలాస భాసురంబగు నవరసబంధుర దృశ్యప్రబంధముం బ్రదర్శింపు' మని నా కాజ్ఞాపించిరి. తదనుగుణంబైన నాటకం బేదియో విచారింప వలయు నని నిన్నిట్లు పిలిచితిని.

నటి

ఆర్యపుత్రా ! మా కిదివరకు మీరు గరపుచున్నది ప్రదర్శింపఁ గూడదా ?

సూత్రధారుఁడు

అవును; చక్కగా జ్ఞప్తికిఁ దెచ్చితివి. సరియే, అదియే నటింతము.

నటి

ఇంతకాలమునుండియు కవినామంబు దెలుపకయే మాచేత నటింపించుచుండిరి. నేఁడైనను తెలియజేయఁగూడదా?

సూత్రధారుఁడు

తే. గీ. చల్లపల్లినృపాలుని • సభను, విశ్వ
దాతచేతను బిరుదంబు • ధరణి గొన్న
భాస్కరనృపుండు రచియించె • భక్తితోడ
సరసులకు రంజనంబయి • వరలునట్లు.

నటి

అయిన నూతనరచన లేల యవలంబింపవలయును?

సూత్రధారుఁడు

నూతనమో సనాతనమో విమర్శింపవలసిన యవసరము మనది కాదు; సరసులగు కవితావిమర్శకుల కార్యము.

నటి

(వినుట నభినయించి) అదుగో దేవర్షులగు నారదమాసీంద్రులు!

సూత్రధారుఁడు

అయిన మనము బోవుదము రమ్ము. (అని నిష్క్రమింతురు.)

(ఇది ప్రస్తావన)

# భారతీయము

## ప్రథమాంకము

### ప్రథమరంగము

ఇంద్రప్రస్థపుర ప్రాంగణ ప్రదేశము

(నారదుని ప్రవేశము)

నారదుఁడు

కల్యాణిరాగము—ఆదితాళము.

మురళీలోలా మోహనలీలా
కరివరదా నను గావుము దేవా॥ ము॥

పావనమగు నీ పాదకమలముల
సేవ జేసెదను శౌరి మురారీ॥ ము॥

పాపహరణ శ్రీతాపసనుత నీ
ప్రాపు గోరితిని భవభయహరణా॥ ము॥

యాదవకులమణి నీదయారనము
మాధవ రాధాపతి బరవుమురా॥ ము॥

ప్రాతఃకాలమునం దమరావతినుండి బయలుదేరి యింద్రప్రస్థపు రంబున కరుదెంచుచుండ నూర్వశి నాకెదురై పూర్వ మర్జునుండు తీర్థయాత్ర జేయుచు దేవేంద్రు నాస్థానంబగు వైజయంతమున కరుదెంచి

నవ్వాడు తనకును పార్థునకును జరిగిన శాపకారణము దెలిపినది. శాపనిర్వాహణ పరిసమాప్తికి నేటి నాప్రయాణము దోహదము కాఁగలదు. కురుక్షేత్ర యుద్ధానంతరమున పాండురాట్కుమారుల గాంచి చాలకాల మైనది. మరల నొకపరి వీక్షింప నవకాశము లభించినది. ఈ కుతూహలమునకు నాయుద్యమము దోహదము. త్రివిష్టపమునుండి యెంతత్వరగా నడచితిని. చండమయూఖుని బంగారుకిరణపుంజములకీ పురవరం బెంత శోభాయమానముగా నున్నది!

సీ॥ బంగారు నీరెండ ♦ శృంగార మొలికింప
సౌధాళి శిఖరాల ♦ చక్కఁగనము
కరి తురంగమ రథో♦త్కట వీర భటసైన్య
యుతమైన దుర్గాల ♦ యురుతనంబు
పాషాణ తైల బా♦ణాసన ముద్గరాం
చితమైన బురుజుల ♦ చిక్కదనము
నీలమేఘంబుల ♦ నొగురగొట్టఁగఁ జాలు
కేతన స్తంభాల ♦ నేతఁదనము
తే॥ గీ॥ సుందర లతాంతములతోడ ♦ సొంపు లొలుకఁ
బ్రమదవన తరు బొడ్డన♦బావు లొప్ప
వివిధజన వర్తనంబుల ♦ వేడ్కఁగొలుపు
నాపురంబున కెన యల♦కాపురంబు.

ధర్మరాజుఁడు దర్బారున కరుదెంచుసమయము సమీపించుచున్నది. తగిన యదనున కే నరుగవలయును. (మొదటికీర్తన చదువుచు నిష్క్రమించును.)

ఇది విష్కంభము.



## మయసభ

వ్యాసుఁడు, పాండవులు, విదురుఁడు, వృషకేతుఁడు, మేఘవర్ణుఁడు, దర్బారునం
దుండఁగా నారదుఁడు పాటఁబాడుకొనుచు వచ్చుచుండ
అందరు సుచితరీతి యెదురేగి తోడ్కొని వత్తురు.

### ధర్మరాజు

(స్మృతి నభినయించి) ఎక్కడిదా దివ్యగానామృతము. (ఎదుట పరికించి) తగిన సమయమునకే దేవమునీంద్రుఁడు దయచేయుచున్నాఁడు. (పై సందర్భము) మహానుభావా! సాత్యవతేయా! అస్థిరంబు లగు రాజ్యసుఖంబుల కిచ్చగించి శాశ్వతకీర్తిధనులైన భీష్మ ద్రోణ కర్ణాది మహాత్ముల కురుక్షేత్ర సంగ్రామరంగంబున సమరధర్మము వీసరబుచ్చి సమయింపఁ జేసితినిగదా! ఈ దారుణపాతకము మాకేవిధంబున శమించును? (భీమార్జును లొకరితో నొకరు గుసగుసలాడుదురు.)

### వ్యాసుఁడు

ధర్మనందనా! ఇందఘం బేమున్నది? ఉత్తమ క్షత్రియులకు "అసంతుష్టో ద్విజో నష్టః సంతుష్ట ఇవ పార్థివః" యనునట్లు మిన్నకుండుట యకర్తవ్యంబు. సామదానాది చతుర్విధోపాయంబుల రాజ్యంబు గొనుట కర్తవ్యము. (భీమార్జునులు వ్యాసుని పల్కులకు సగర్వముగా తలలు పంకింతురు)

### ధర్మరాజు

శత్రుగర్వనిర్వాపణం బొనర్చి రాజ్యంబుగొనుట సమ్మతము. మిత్రగురు సుహృజ్జనంబుల సమయించి రాజ్యంబు గొనుట యుత్తమ క్షత్రియ లక్షణంబు గాదు. ఇంక నందుఁ బల్గొని,

సీ॥ నిరతంబు ఘనదాన • పరుఁడైన యాభాను
నందను వధియింప • నఘముకాదె?
బాల్య మప్పటినుండి • మమ్ము బెంచిన భీష్ముఁ
జంపింపఁజేయుట • చనునె మాకు?

దళితాస్త్రశస్త్ర వి॰ద్యలను నేర్పిన యట్టి
గురుని దున్సించుట ॰ యురుగుణంబె ?
జ్ఞాతుల ననిలోన ॰ నమయింపఁజేయుట
యఖిలకిల్బిషవృత్తి ॰ యగునుకాదె ?
తే॥ గీ॥ బాంధవన్నపాళిమిత్రులఁ ॰ బవరముననను
ధర్మమును వీడి పొలియింపఁ॰దగున మాకు ?
యర్హకృత్యంబు జేయక ॰ యవని నీతి
కలుషమొనరింప నది పాత॰కంబుగాదె ?

నారదమౌనీంద్రా! తాము పుణ్యమార్గోపదేశ మొనరింపఁ బ్రార్థితులు.

నా ర దుఁ డు

పాండవాగ్రజా! వ్యాసభగవానుని హితోపదేశంబులకు మదీయాగమనం బంతరాయంబు గాదుగదా ?

ధ ర్మ రా జు

మునికులపవిత్రా! బ్రహ్మపుత్రా! కడుంగడు మంచి నమయంబున మాపూర్వపుణ్యవిశేషంబున దా మరుదెంచితిరి. నేటి మీశుభాగమనంబు మాభావికాల భాగ్యోదయము.

వ్యా సుఁ డు

నిశ్చయము. ధర్మజా! పూజ్యులగు మౌనీంద్రులతో గూడ నీ నందేహంబులు విన్నవింపుము.

నా ర దుఁ డు

అనవసరము. ధర్మజునినందేహంబుల వింటిని, అందుపై తమ హితోపదేశ మాకర్ణింప కుతూహలంబు.

వ్యా సుఁ డు

నయగుణవిశారదా, నారదా! సంగరమున వీరస్వర్గ మలంకరించిన యుత్తములగూర్చి విచారింప నేల ?

### నారదుఁడు

తపోధనాగ్రణీ! బాదరాయణీ! సంగరరంగంబున నిజపౌరుషంబున పవిత్రధర్మము నెరవేర్చినగదా పౌరుషశాలు లనం బరగునది. తదీయ వివరం బటులుండ, ధర్మతనూభవుండు, ఖండనంబునం బడిన దోర్దండ ప్రచండ ప్రకాండులగూర్చి విచారం బేమియులేదుగాని ధర్మనిర్వాహణ వేత్తలయిన యామహామహులం జంపించిన పాపంబేవిధంబున బోవునని ఖేదంబున కొందలంబందుచుండె గావున నా సందియంబుఁ దీర్పుము.

### భీముఁడు

కాంతిజితశరన్నీరదా, నారదా! ఎందులకీగతజలసేతుబంధనము. మాపెద్దన్నయ్యకు సందేహము లేనిదెన్నఁడు? వీరి మూలముననే దుర్భర దురంత దుస్సహ కష్టనిష్ఠురములు మమ్మెప్పటికప్పుడు కనిపెట్టుకొని యుండును.

ఉ॥ పాపులు కౌరవాధములు • పాపముఁజేసిన వారి పాపమే
పాపమునై దురాత్మకుల • ప్రాణముఁ దీయగఁ దత్ఫలంబుకై
పాపము పాపమంచు నిటు • వాదనఁజేసెడి వీని పాప మే
పాపమొ పల్కుమా విమల•పాటవ మొప్పగఁ దాపసాగ్రణీ!

### సహదేవుఁడు

సోదరా, భీమసేనా! తొందరజెందినచిత్తపుతందరమున పాత్రౌచిత్యమును గూడ మరచిపోవుచుంటివే, హింస యూరక బోవు ననియా నీ యాశయము?

ఉ॥ తొందరఁ జెంది సోదరునిఁ • దూ లిటు లాడెద వేల? మారుతీ!
కొందలమందు ఖేదమున•కున్ సమయోచితభాషణంబులన్
పొందుగ బల్కియావనట • బోవగజేయగ లేక యూరకే
డిందువడంగఁజేయు టిది • తేజమొ? సోదరధర్మమే, భువిన్.

నకులుఁడు

సహదేవా! నిశ్చయము. పాపమునకు పశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తమని గదా ప్రాజ్ఞులు వచించిరి. ఇది యార్యకులతంత్రమందువా? నిశ్చయమునకు భీష్మ ద్రోణ కృపాచార్య ప్రముఖులు ఆత్మవంచకులే గాక కుత్సితులు, క్రూరులు, విశ్వాసఘాతకులు, స్వామిద్రోహులు కూడనని నా యంతరాత్మ ప్రబోధించుచున్నది. ఏ నాడైనను యిట్టి వింతలు బుట్టెనే? అన్నగారి నిజాత్మ సంశయములు వీడకున్నవి. (భీమసేనునితో వ్యంగ్యముగా)

తే॥ గీ॥ హింస పాపము మాకు సంహింప భరము
గాన నది పోవు మార్గంబు • కానుపించు
తెరవు నుపదేశము జేయ • దివ్యులైన
వీరి వేడగ బెదరెద • వేల? సనుజ!

అర్జునుఁడు

సోదరులారా! ఎందులకీ యనిమిత్త జనితోపవాదంబులు, వ్యర్థ కలహ వ్యంగ్యోక్తులు! ఇటు వినుడు.

ఉ॥ చంపున దెవ్వ డిజ్జగతిఁ • జచ్చున దెవ్వడు, జీవి జీవి భ
క్షింపుచునుండ జీవులకు • క్షీణము దప్పదు; నైజ మారయన్
తెంపున మానవుండు తన • తేజముఁ జూపి సపౌరుషంబుగాఁ
జంపున దేనినైన, నది • చచ్చునె యీశ్వరునాజ్ఞ లేనిచోన్.

వృషకేతుఁడు

తండ్రీ, ధనంజయా! అనుభవములేని యుక్తిప్రయుక్తులవలన ప్రయోజనం బినుమంతయు గలుగనేరదుగదా!

తే॥ గీ॥ ప్రజన నశియించుదానికి • సృష్టికర్త
పుడమి భూతంబుల జేయఁ • బూన నేల?
దా నెవడు చేయునది యేమి • తగ వచింపు
నైజములు కాకపోనిచో • విజయవీర!

అర్జునుడు

కుమారా! వృషకేతూ! ఈశ్వరుఁడు విలాసముకొఱ కట్లు చేయుచుండును. అది తెలిసికొనఁజాలక మన మిట్లు ప్రేలుచుందుము.

నారదుడు

అర్జునా! పవనపుంజము లేల సమకట్టెదవు? నీవు తెల్పినవిషయ మెంతవర కాధారమైన సమాధానము కాఁగలదు? యథార్థం బెఱిఁగితి వేని వచింపుము.

వ్యాసుడు

పాండవులారా! అప్రస్తుతాంశమున కిన్ని తర్జనభర్జనము లెందులకు? ఉదారచరితులచరితంబు లుదాహరణములుగాఁ గొని, శత్రువధ పాతకంబునకుఁ జింతనొందక, మున్ను రఘురాముండు, పూర్వదేవతా సంహారంబు గావించి, తత్పాపవిముక్తికై యశ్వమేధయజనంబుఁ గావించినటుల మీరును నా యజ్ఞంబు గావించినచో సంశయ పాప భరంబులు దీరిపోవును.

నారదుఁడు

(తనలో) పెద్ద లనుకొనినవారల నిర్దేశంబు లివి. ప్రశ్నించిన విషయము మఱుగువుచ్చి, పైపై శబ్దాడంబరములతో సందేహనివారణంబు సేయ యత్నించుట యసమర్థత యని వీరి కేల గోచరము కాదు? అయినను వెనుకటిప్రసంగము స్మరణకుఁ దెచ్చి నే నేల శుష్కోపవాస ముండవలయును? నేను సందేహింపక వ్యాసుని హితోపదేశమునే సిద్ధాంతపఱచెదగాక! (ప్రకాశముగ) ధర్మనందనా! కృష్ణద్వైపాయనుని యాజ్ఞానుసారముగా యశ్వమేధం బొనర్చుట సుహృజ్జన వేద విహితం బని నా యభిప్రాయము. కావున నట్లొనరింపుము.

మేఘవర్ణుఁడు

పరాశరనందనా!

ఉ॥ మంచికిఁ జెడ్డకు న్సుగుణ♦మాన్యుఁడ వీ వొక దూఁడఁ నట్టి పా
వంచికమందు లౌకికముఁ ♦ బాలనఁజేయుచునుండె; లేనిచోఁ
నంచితమైన మానవుల ♦ యాశయ మెల్లను నొక్కరీతిఁ గా
వించుక నుందురే కద! వి♦వేకవిధిజ్ఞ ముని బాదరాయణీ!

ధర్మరాజు

వత్సా, మేఘవర్ణా! బాల్యచాపల్యంబునం జేసి పెద్దల నటుల లాఘవం బగు మాట లాడరాదు.

మేఘవర్ణుడు

చిత్తము!

ధర్మరాజు

సాత్యవతేయా! ఈబాలకుని పలుకుల కలుకఁబూనక మన్నింపుము. బంధుచ్ఛేదనంబుచే సంభవించు కిల్బిషము నిర్మూలనం బొనర్చు నా క్రతువిధానం బెఱింగింపఁ బ్రార్థన. (వ్యాసనారదులఁ గాంచి భీమార్జునులు మాటలాడుకొందురు.)

విదురుఁడు

ఉ॥ పిన్నలు పాండురాట్సుతులు ♦ పెద్దలు మీరలు ధర్మనిర్ణయం
బెన్నిక సేయువారలు వి♦వేకరతుల్ నయువేది బుద్ధిసం
పన్నులు పాండవాగ్రజుని ♦ బ్రార్థన చిత్తమునందు నుంచి సం
పన్నుని జేయ వేడెదను ♦ బాలనఁజేయుఁడు చిత్తశుద్ధిగన్.

వ్యాసుడు

పాండవేయులారా! మహాధ్వరం బగు నశ్వమేధంబు నిర్వహించుట కఖిల వేదశాస్త్రపురాణేతిహాసకథాసుధానుభవులును, నంచితాన్వయ సంభవులును, నచ్యుతపాదారవిందభజనానందకందళితహృదయారవిందులును, నతిమనోహారప్రభావిడంబితరవీందులును నగు నగ్రజన్ము లిరువది వేల ఋత్విజులు కావలయును.

మేఘవర్ణుఁడు

బాదరాయణీ! ఈ స్వల్పసంఖ్యావసీనురులు చాలునా? (నారదుఁడు నవ్వును. అర్జునుఁడు వద్దించినటుల సంజ్ఞ జేయును)

వ్యాసుఁడు

(వినిపించుకొనక) ప్రథమదివసంబున నియతుండై తురంగంబు నర్చించి విసర్జించునప్పుడు యొక్కొక్క విప్రునికి హాటకాలంకృతం బగు నొక్క ఘోటకంబును, నొక్కొక్క మదద్విరదంబును, హిరణ్మయ శృంగరజితఖురసహితంబు లగు గోసహస్రంబును, భారపరిమితి హేమంబును సమర్పింపవలయును.

సహదేవుఁడు

(స్వగతము) లజ్జాభిమానములు విసర్జించిన యీ పారాశరి యీ పేరోలగంబున నున్న దున్నట్లు తెల్పునా యేమి? ఆహా! ఏమి యశ్వమేధము!

ధర్మరాజు

(ఆలోచనగా) మహాత్మా! తరువాత——

వ్యాసుఁడు

ఉ॥ హీరపటీరవర్ణము సు • హేమపుపుచ్ఛము నీలకర్ణముల్
ధీరజవోత్తమం బగు సు • ధీనుతమా హయ మంది నూత్నశృం
గారమొనర్చి వేదవిధి • గా విడువం దగు చైత్రపూర్ణిమన్
వీరులు వెంటనంటఁ గడు • వేడుక వత్సరదీక్ష జెందఁగన్.

మఱియు,

కం॥ పట మొకటి దానిముఖమున
పటుతరధీశక్తిగలుగు • పౌరుషవంతుల్
తటుకున బట్టుం డనుచును
దిటముగఁ బతిపేరు వ్రాసి • త్రిప్పఁగ వలయున్.

సహదేవుఁడు

తపోధన్యాగ్రణీ! బాదరాయణీ! పిమ్మట—

వ్యాసుడు

అధ్వరతురంగ మే యే స్థలంబుల విహారయాత్రంబుల విడుచునో నా యా తావులనెల్ల హోమంబులు జేయించి ధాత్రీసువర్ణాలకు వేదవిధి ప్రకారంబుఁ గోసహస్రంబులు భూరిదక్షిణలను భక్తిపురస్సరంబుగా నొసంగవలయును.

మేఘవర్ణుఁడు

మహాత్మా! ధాత్రీసువర్ణాల కిం కేమేని నొసంగవలయుచో నూహించిమాత్రము మఱువక యెఱింగింపుడు.

అర్జునుఁడు

(మేఘవర్ణు వారించి) మహానీయా! ఉపదేశింపుఁడు. సావధానులమై వినుచుంటిమి.

వ్యాసుఁడు

ఆపై దీక్షితుఁ డధ్వరాశ్వము దిరిగివచ్చువరకు నష్టాంగితో నియతుండై భోగంబుల వర్జించి దీక్షాతంతుఁడై యుండవలయును. అధ్వరతురంగము నిర్విఘ్నముగాఁ దిరిగివచ్చినతదుపరి తదుక్తప్రదేశమునందు

మ॥ సుజను ల్బ్రాహ్మణులు సర్వపండితులు యాంశుండైన శ్రీకృష్ణుఁ డ
క్కజమంద న్నట విప్రకామినులు జూడ న్వేడ్క యజ్ఞస్థలిన్
యజమాన ప్రముదావిశస్వరభగంన్యస్తాశ్వదీర్ఘస్మర
ధ్వజదండం బగు నశ్వమేధమఖతంత్రంబు నొప్పెసర్పం దగున్.

మీర లీక్రతువును నిర్వహింతురేని సర్వపాపములు హరించి పరమపావను లగుదురు. (అందఱు విస్మయాననులై యొకరి నొకరు చూచుకొందురు.)

సహదేవుడు

ఇంకేమని చేయింపవలయునా?

నకులుడు

ఇంతకన్న జేయవలసిన దేమున్నది? ఆహా! భారతధర్మమిదియా?

సీ॥ ప్రేతపురీనాథు • బిడియపడంజేసి
యడలింపఁజేసిన • యతివ సాధ్వి
కానలోన కిరాతుఁ • గసితీరిగాఁ దిట్టి
భస్మంబొనర్చిన • పడతి చరిత
సత్యసంరక్షణ • సందర్భమునకునై
పరుల కూడిగ మున్న • మగువ తెగువ
ప్రాణనాథునియాజ్ఞఁ • బాలింప ప్రళయాగ్ని
నుఱికియు బ్రతికిన • యువిద శీల

తే॥ గీ॥ మకట గణియింపకయె లోక•వికటసరణి
ధర్మమని నీతియని మాయ • మర్మములను
పలుకు లిఖయించు వ్యాసుని • భవ్యుఁడనుచు
పలికెద రిదేల భారత•ప్రజలు నేఁడు.

వృషకేతుడు

(తనలో) ఇట్టి సాంప్రదాయకు లిట్టివారల కిట్టి ధర్మోపదేశము లే చేయుచుందు కాఁబోలు!

వ్యాసుడు

(యుంకించి తలవంకించి) శమనతనూజా! పార్థునకుఁ జేసిన భగవద్గీతోపదేశమును వింటివిగదా! సందేహింప నేల?

అర్జునుడు

మహాత్మా! ధన్యోస్మి; ధన్యోస్మి. ఇంకేమిమి నిర్వర్తింపవలయును?

వ్యాసుడు

ధర్మజా! ఏమది? మిన్నక యోచింపుచుంటివి. (అర్జును నాపి)

ధర్మరాజు

అనఘా, కృష్ణద్వైపాయనా! నా విచారం బేమని వక్కాణింపఁగలను? మరల హింసారూపకమైన హయాధ్వరంబు నిర్వహింపవలయునుగదా!

మ॥ ఒకజాతి న్నొకపట్టణంబు నొకరా॰జుల్ రూపుమాయింపకే
సకలోర్వీసురులున్ హితాళి నృపతి॰స్వాంతంబు శోభింప న
య్యకళంకుం డగు రామచంద్రవిభుఁ డ॰ద్యద్యశ్వమేధంబుఁ దా
నొకగోరంత కొఱంతలేక గొనఁడే॰ యుర్వీజను ల్మెచ్చఁగన్.

భీమసేనుఁడు

అగ్రజా!

మ॥ అనఘా! సందియ మేల సర్వనృపవ॰ర్గంబెల్లఁ బోరంగ వి
ఘ్నసబాహాబలశౌర్యకార్యమునకున్ ॰ కాల్నిల్పి పోరాడనో
పున భూమీపతి యొక్కఁడేని యనికిన్ ॰ పూన న్వడిం ద్రుంచి యే
పునఁ దోరంబులఁ గ్రుచ్చకుందున శిరల్ ॰ భూరిప్రతాపోన్నతిన్.

అర్జునుఁడు

మ॥ ఇల ధర్మావనినేత యశ్వయజనం ॰ బెంతేని గావింప నం
దుల కే భూపతియైన యుద్ధహతికిన్ ॰ దోర్గర్వసంయుక్తుఁడై
నిలువ న్నేర్చునె న న్నెఱంగరొకొ మ॰న్నీదుల్ ధరామండలిన్
విలయోద్యద్ఘనభేది మామకధను॰ర్వేగంబు విన్నంతనే.

వృషకేతుఁడు

(తనలో) ఇప్పు డెందులకో నా డెంద మావేశము నొందుచున్నది. డెందమా! కొందలంపడకుము. (ప్రకాశముగా)

చ॥ శమనతనూజ! మీ రిటుల ♦ సందియమందఁగ నేటి; కింక నే
సమరతలంబున న్నిలువఁ♦జాలిన నోపఁ డెవండు; నింక గ
ర్వమున నృపాలుఁ డెవ్వఁ డిటు♦వచ్చును? వచ్చిన వాని వ్రచ్చి మీ
విమలప్రతాపకీర్తితతి ♦ వెల్లడిచేయుచె విశ్వమంతటన్!

సహదేవుఁడు

మీరలంద రనుచితముగా మీ మీ దోచిన రీతుల శౌర్యంబుల వెల్లడించుచుండిరేగాని యన్నగారి మనోనిశ్చయమును సాంగోపాంగముగాఁ బ్రకటింపనీయరైరి. మనలో మనమే యిట్టి బిభీషకంబులఁ బలుకుకొనుట యనంగీకారము. మనయన్నగారు నిశ్చయమును వ్యక్తీకరించుదనుక శాంతిఁగొందఁ గోరుచుంటిని.

మేఘవర్ణుఁడు

శా॥ శాంతంబంచు వచింప నేటికి సమ♦స్తాశావకాశంబు ల
శ్రాంతం బు న్నమకూర్పఁజాలిన మహా♦శౌర్యాన్వితు ల్గర్వవి
క్రాంతు ల్భ్రాతయు పార్థుఁడాదిగల భూ♦కాంతు ల్విజృంభింప వి
శ్రాంతం బొప్పఁగ సంగరం బని కృథక్ ♦ సారించి పోర్గందురే.

నకులుఁడు

వత్సా! మేఘవర్ణా! ఏటి కీవృథా వాగ్వ్యయము. సోదరుండుపదేశించిన యాదేశంబును తోసిరా జనకుడు. (తనలో) వీరిపల్కులపై యన్నగారిమనోగతము మారిన ట్లున్నది. అందుకు వ్యతిరిక్తముగా నడచుట ధర్మము గాదు. పుణ్యముగానీ పాపముగానీ యగ్రజు ననుసరించుటే కర్తవ్యము. (ప్రకాశముగ) తమతండ్రిల కురుక్షేత్రరణరంగంబునఁ గూల్చినందులకుఁ నారాజకుమారులు కోడెత్రాచులవలె మనపైఁ బగఁగొనియున్నవారలు. ఇంక తటస్థులై మిన్నకొనియున్న మహావిక్రమోపేతు లగు భూకాంతులందరు మున్ను దశరథునివలె గాజులు దొడిగించుకొని రనియా మీయభిప్రాయములు! ఏవుట్టయందేపామున్నదో మన కేమి దెలియును? సర్వదేశాటనము గావించి సర్వ

రాజన్యవరేణ్యుల శౌర్యధైర్యంబులఁ గమనించిన మన యర్జునుఁడే తొందరపడి గర్వోక్తులఁ బలుకుచున్న నే నే మనఁగలవాఁడను? గర్వము కూడనిగుణముగదా! అశ్వమేధ మనిన మీరు గమనించితిరా? సంపూర్ణముగా నాలోచింపుడు.

భీమసేనుఁడు

రోషలజ్జాపరాక్రమహీనులై యేటి కీయనిమిత్తపాపనివారణోద్దేశజనిత కల్మషపంకమున దిగఁబడెదరు క్షత్రియులై జన్మించిన ప్రతి వ్యక్తియు వీరమహారణ్యంబును కృంకటివేళ్ళతో పెళ్ళగించి భస్మీపటలముజేయ నూహించవలయునేగాని భవితవ్యమునకు భయపడుచుండిన మీవంటిపిఱికిపందల నే మనవలయునో యూహింపజాలకున్నాఁడను.

నారదుఁడు

(వారించుచు) శౌర్యధైర్యగాంభీర్యసంఘులారా! దేశకాలపరిస్థితులను దెలిసికొనక ప్రగల్భము లాడినను ప్రయోజనము లేదు. యోగిశ్రేష్ఠయుఁడైన సాత్యవతేయుఁ డుపదేశించిన యశ్వమేధ మంత లాఘవదృష్టితో గమనింపదగినది కాదు. ఏ కార్యమేని విచారించి యొనరించుట యుత్తమలక్షణము. ధర్మజుని నిర్ణయమును వినుఁడు.

అర్జునుఁడు

శౌర్యప్రతాపంబుల నిర్వీర్యముజేయు మీవంటి జడదారుల హితోపదేశముల మూలముననే మా ధర్మజున కిన్ని సందేహములు, నిత్యశంకితములు గలుగుచుండుటకు మూలములు. సమర్థులై యున్నవారల కిన్ని భవితవ్యము లెందులకు?

చ॥ ప్రమథగణాధినాథుఁడు సెబాసని మెచ్చఁగ సర్వనిర్జరుల్
సుమములఁ జల్ల దానవుల సుక్కణగించి మదీయసద్గుణ
న్నమరతనూజు కర్ణు సమరావని గెల్చిన సవ్యసాచివి
క్రమము త్రిలోకభీకరముఁ గాంచదె శాంత మ దేల నారదా!

### ధర్మరాజు

భీమార్జునులారా! "షడ్భాగం మనుష్యాణాం న ప్రతిభి ర్దైవ చింతన" మ్మనునట్లు మీర లీవిధంబున గర్వోక్తు లుచ్చరించుట మన భావికాలభాగ్యోదయంబు గాదు. యోగిధ్యేయులైన మహానుభావుల మీర లీసడించి మాట్లాడ జనదు. అపరాధము. మీరు బల్కినటులన ధైర్యపరాక్రమోపేతులే యగుదురుగాక!

చ॥ ఇదివరకే సమ స్తధర♦ణీపతులందరి నాజిఁగూల్చి రా
సుదతుల కెల్ల దుఃఖములు ♦ జూపితి మంతియెగాక పిన్నలై
పొదలుచు నున్నవా రగు సు♦పుత్రుల నాజికిఁ బిల్చి క్రూరత
కదనముసేయఁగోరు టది కాదు ♦ సుధర్మము శక్రనందనా!

అదియునుగాక___

సీ॥ తమనాథులను బట్టి ♦ సమరోర్వి మడియించి
నా మని మననెల్ల ♦ నాడిపోయు
తమతండ్రుల వధించి ♦ ధరణిఁ గొంటి మటంచు
ననయంబు మనలను ♦ నణఁగఁద్రొక్కు
తమరాజవర్గంబు ♦ నమయించితి మటంచు
చటులరోషంబున ♦ కుటిలు లగుచు
తమరాష్ట్రపాలనా♦ధరణీశులను జంపె
నని నేఁడు మనపైని ♦ నలుకఁగొన్న
తే॥ గీ॥ దారపుత్రాది బంధు ప్ర♦ధానులెల్లఁ
దిట్టి వడిగొట్ట గీలింపఁ ♦ దిరుగుచున్న
దేశవిద్రోహకర మగు ♦ తెరువు గొన్న
యశ్వమేధం బొనర్పఁగా ♦ నగునె మనకు?

### భీమసేనుఁడు

అన్నా, ధర్మజా!

గీ॥ పలుకుఁబలికిన నిర్వీర్య • మొలుకఁజేయు
నీకు గాంభీర్య మెవ్వరు • నేర్పఁగలరు ?
క్షత్రియోత్తంసు లెచ్చట • క్షాత్ర మెచట
కులములో లేని భీతిని • గూర్చు టేల ?

వ్యాసుఁడు

భీమసేనా ! యొక్కింతదడవు యోర్పు వహింపుము. (ధర్మరాజునితో) ధర్మరాజా ! అదియా నీ సందియము. మీభాగ్యలత పల్లవింపఁజేసిన పురుషోత్తముఁడును, మి మ్మనవరతము మార్జాలకిశోరన్యాయమున కంటికి రెప్పవలెఁ గాపాడు యదుకులపారావారనిశాకరుం డగు వసుదేవ నందనుండు మీ కండదండయై యుండ సందేహింప నవసరము లేదు. ఆ మహానుభావు నాహ్వానించి నా యాజ్ఞానుసారము ప్రవర్తింపుము. (నారదుఁడు వివిధాలోచనములు నటించును.)

విదురుఁడు

నాయనలారా ! యింకను సందేహించి యుపేక్షించెద రేల ?

ఉ॥ చిన్నతనంబునుండి కడుఁ • జేవఁ దలిర్పఁగ మిమ్ము జేర దీ
సెన్నికతోడ సర్వజయ • మెల్లను మీ కమరంగఁజేయు యా
వన్నగశాయి శ్రీహరి కృపానిధి కృష్ణుఁడు యిష్టదైవమై
మన్ననతోడఁ బ్రోచు విను • మానసమం దిక శంక లేటికిన్.

ధర్మరాజు

సోదరులారా ! పరమపావనుండును, భగవంతుండును, విశేషించి పాండవులకుఁ బరమాప్తుండును నైన యా కంసధ్వంసి మనలఁ బరిపాలించుటచేతనేగదా ఈ రోజువరకి ట్లుంటిమి !

సీ॥ పతితపావనుఁడైన • యతఁ డుంటచేఁగాదె
బలుకష్టములనుండి • బయటపడుట
భగవంతుడైన యా • ఖగగామి మనయుండ
నుంటచేఁగాదె నీ • యుర్వి మనుట

దీనబాంధవుఁడు మా • దిక్కు నుండుటఁగాదె
పాంచాలి బన్నంబు • పడయకుంట
పుండరీకాక్షుఁడు • బ్రోవఁబూనఁగఁగాదె
విజయంబు మాకు ల•భించియుంట
తే॥ గీ॥ నింకమీఁదను నటులె నా • యాశుకరుణ
చేత సురలెల్ల నుతియింపఁ • జెలఁగి యశ్వ
మేధమొనరింపఁ గల్గుదు•మేని పాప
పంకిలము బోవఁ గందు ని•శ్శంకముగను.

### నారదుడు

(ఆత్మగతము) నా భావము నిప్పుడు ప్రకటించి భీమార్జునుల గర్వోక్తుల పర్యవసానము గమనించెదగాక! (ప్రకాశముగ) ధర్మతనూభవా! నీవు వచించినదంతయు యథార్థమే గాని లోకులలో నొక్క సందేహంబు గలదు. దానిని నా విన్నతెరం గెఱింగించెదను. నన్నన్యథా తలంపక దూర మాలోచింపుఁడు. ఏమన——

కం॥ పరమాత్ముం డగు శ్రీహరి
వరమున గురుభీష్మకర్ణు • వారణబలులన్
కౌరవులనెల్ల నాజిని
పరగను పాండవులు గెలిచి • ప్రతిభను గని రౌ.

(భీమార్జునులు హుంకరించుచుందురు. అందరు వారిని జూచుచుందురు.)

### ధర్మరాజు

నారాయణభజనానందకందళితహృదయారవిందా! నారదా! అందులకు సందియ మెంతమాత్రమును లేదు. ఆ మహామహుని యప్రతిమానుగ్రహమువలననే మాకీసర్వవిజయప్రాప్తియు, ఈసింహాసన ప్రతిష్ఠయు సంభవించినది.

## భీమసేనుడు

ధర్మజా! ఏమి నీ యపభ్రంశప్రసంగములు. లోకులు విన్న నవ్వుదు రన్న శంకయైన లేక పలుకుచుంటివి. అవక్రవిక్రమోపార్జితులై జగదేకపరాక్రమోపేతులై నీసోదరులు నీనేత్రముల కెట్లు గన్పించుచుండిరి? భీష్మద్రోణరాధాతనూభవధార్తరాష్ట్రశతయోధాదిపరికల్పితకురుక్షేత్రసంగ్రామవిజయోపార్జితవిక్రము లగు నీభీమపార్థుల నంత యసమర్థులుగాఁ దలఁచితివే! ప్రళయాంభోదభయంకరారావసదృశం బగు మత్సింహనినాదంబుచే నీ జగత్సంశయంబుల క్షీణింపఁజేసిన నా పరాక్రమము నీ వెఱుంగవే? కాలానలజ్వాలాభీలరూక్షావీక్షణప్రతాపంబుల శత్రుగర్భనిర్భేదన మొనర్చిన నా ప్రతాపదార్ఢ్యము నిర్జరనిర్ఝరానందకందళ మని నీకుఁ దెలియదా? ఆ యాదవునివలననే మనకీ సర్వవిజయప్రాప్తి చేకూరినదా? ఆహా! యేమి నీగంభీరపౌరుషోక్తులు? అవష్టంభశుంభదంభోళికాస్వరూప మెట్టిదైనను నరియే మద్భుజావిక్రమమున కాపోశనసదృశం బని గ్రహింపుము. ఆహా! యేమి నీగంభీరపౌరుషోక్తులు! ఆ నల్లగొల్లనివలన మన కేమి గల్గిన దని నీ వింతగా వాని నగ్గించుచుంటివి? ఆతని చరిత్రము నీకు సంపూర్ణముగాఁ దెలియునా! వినుము.

సీ॥ మాయలు రచియించి ♦ మడియించుటే గాని
యెదురుగాఁ బోయి జ♦యింపలేఁడు
బూటకవృత్తితో ♦ బోకరించుటె గాని
నిజముగా మంచి గ్ర♦హింపలేఁడు
గారడీల విధాన ♦ కలహించుటే గాని
పౌరషంబుగ నిల ♦ బడఁగ లేఁడు
యితరులచే శత్రు♦తతిని గూల్చుటె గాని
తనకుఁ దానై వైరిఁ ♦ దునుమ లేఁడు

తే॥ గీ॥ కపటముల పుట్ట కోర్కుల • గట్టు యట్టి
దేవకీపట్టి మనబెట్టు • దీర్పగలడె
చాలు ధర్మజ! నీదు వాం•ఛాప్రవృత్తి
కలుష మగునేమొ • నొక్కింత గట్టిపెట్టు.

విదురుడు

(తనలో) నాటి రాజసూయయాగ సందర్భమున శిశుపాలుం డప్రచ్ఛభాషణంబులకన్న మిన్నలై భీముని పల్కులు మేరమీరుచున్నవే. ఈ సంఘటన యొక యుత్పాతంబునకు సంభవించినది. ఔరా! కాల మహిమ! (ప్రకాశముగ) నాయనలారా! అనువుగల సమయమున నిట్టి వాక్యముల నేల బల్కెదరు? యుక్తాయుక్తంబుల జోపీడి పలుకుట తగని పని సుమా! భగవద్దూషణ మూరక బోవునది గాదు. ఆపదలందు దేవు నభిలషించి సుఖములందు దూలనాడుట మీవంటి ధీరులకు తగని పని. ఉద్రేకమున తొందర కెందుకు బడెదరు?

అర్జునుడు

జరాసంధుని సంగ్రామంబున నిర్జింపలేని పిఱికితనంబున విముఖత గొన్న సామాన్యుని, పారిజాతాపహరణోద్యోగంబున సాత్రాజితిపదతాడి తన్యానంబు గొనని పామరుని నుతింపుచుంటిరి. మి మ్మే మనుకొనవల యును?

మ॥ పరమోదారుఁ డటంచు యాదవహితుల్ • భావింప నవ్వారినుం
దరుల న్మోసముసేయు దుండగుని సం•దర్భంబు లూహింపకే
పరమాత్ముండని దేవదేవు డని సం• భావింపగా నేల నీ
చిరుగొల్లం డిటు యశ్వమేధవిధికిన్ • చేదోడు గా జెల్లునే?

వ్యాసుడు

భీమపార్థులారా! పాత్రోచిత మెఱిగి సంభాషింపుఁడు. బాల్య మప్పటినుండియు ననేకోపకారము లొనరించిన పరమోపకారిని దూల నాడి యింకను పాపము సంపాదించుకొనకుఁడు.

నారదుడు

(తనలో) నా యూహాలతాళి పుష్పించినది. ఇంక సారభోత్పన్నంబులు కాఁగలవు. ఇంక ద్వారవతికిఁ బ్రయాణ మయ్యెదను. (ప్రకాశముగ) భీమార్జునులారా! లీలామానుషవిగ్రహుం డగు నా దేవుని దూషింపకుఁడు. మీ కిష్టము లేకున్న భూషింపకుఁడు.

సహదేవుడు

(తనలో) ఇంక నే మనుకొనవలయును? అశ్వమేధ మీ తీరున నిర్వచించిన వ్యాసుఁడు పూజ్యుఁడు. ఈ భీమార్జునుల నిటుల పురికొల్పిన నారదుఁడు మహానుభావుఁడు. ఇంకొక విధిహితోపదేశంబు సేయకట్టిన కంటకులము. ఇప్పు డేది వచించినను యిటు ఋషులకును నిటు సోదరులకును రెంటికిం జెడిన రేవనిగతి యగుదును. అహా! ప్రవఘటన ఆ శాపానలము స న్నీగతి దహించుచున్నది. ఎంత తెలిసి యేమి ప్రయోజనము?

ధర్మరాజు

భీమపార్థులారా! ఏటికీ యుపాలంభప్రలాపములు. 'వినాశకాలే విపరీతబుద్ధి' యనునట్లు నేటికి మీరుగూడ నిట్టి విపరీతపు భావనలు బలుకఁ జనదు. పూర్వాపరములు తెలిసి సంభాషింపుఁడు. ఇట్టి వాక్యములు బలికిన విని సహింపఁజాలను. మీరు నాయాజ్ఞను జవదాటకుండు రేని నా నిర్ణయప్రకార మొనర్పుఁడు. భీమసేనా! నీవు ద్వారకాపురంబున కరిగి యరవిందాక్షుఁడైన శ్రీకృష్ణభగవాను నిటకుఁ దోడ్కొనిరమ్ము.

భీమసేనుడు

అనుజా! నావలన గాదు. అసంభవము. నేను దోడ్కొని రాను.

ధర్మరాజు

సకలతత్వనీతికోవిదా, విదురా! సదానందుఁడైన గోవిందుని పాదారవిందములసన్నిధి కాహ్వానపత్రిక లిఖింపుము. సోదరా! అర్జునా! పరమాత్ముఁడైన వాసుదేవుని నీ వేగి తీసికొనిరమ్ము.

అర్జునుడు

అటులమాత్రము నేను చేయఁజాలను.

ధర్మరాజు

(కొంతసేపాలోచించి గగనోర్ధ్వము జూచి)

శా॥ ప్రజ్ఞావంతులరైన మీమదిని సంభావింపఁగాలేక నా
యాజ్ఞాభంగము సేయఁగా నగునె రోషంబేల నేఁ డింక మీ
యజ్ఞానంబును వీడి కేశవుపదాబ్జంబు ల్మదిన్నిల్పి నా
యాజ్ఞోల్లంఘన మాని వేగమె ప్రయాణం బింకఁ గావింపుఁడీ.

(భీమార్జునులు నేలఁ జూచుచు నూరకొందురు. విదురుఁడు పత్రిక నీయఁగా లోలోన పఠించి కన్నుల కద్దుకొని తనమొహా రుంచి విదురుని జూచుచు) మహాభాగా! మీరలే యరిగి వాసుదేవు నిటకుఁ దోడితెండు, పొండు. (పత్రిక విదురున కిచ్చును. తెరలో భోజనవేళ దెలుపు మేళములు మ్రోగును.)

నారదుడు

(స్వగతము) నాకుఁ దగు కార్యక్రమం బభినయించినది. (ప్రకాశముగ) ధర్మజా! మీకు భోజనముల వేళయైనది. నాకును కాలాతీతమైనది. ఇంక నే నరిగెదను.

ధర్మరాజు

మహానుభావా, నారదా! తాముగూడ నశ్వమేధయాగ సందర్భమున కరుదేరవలయును. ఇదే మీ కంజలి ఘటించుచున్నాను.

వ్యాసుడు

నిరంతరప్రణవగీతానందహృదయారవిందా, నారదా! పర్యవసానము ప్రకటింపకయే తమ రరిగిన నిది యే మగును?

నారదుడు

పర్యవసానము ప్రకటించుట కే మున్నది? అశ్వమేధయాగ మొనరింపవలయు ననియే నా సిద్ధాంతము. అయినను సర్వసమర్థుండ వగు

నీ నిర్ణయము సర్వహితము. నే నొక్కచో నిలువవీలుగాదుగదా! ఆర్తత్రాణ పరాయణుండైన నారాయణుం డరుదెంచ్చినపిమ్మట మీరును వారును వీరును విచారించి నిర్ణయింపుఁడు. పాండుకుమారులారా! నే నరిగెదను. (అని హరినామస్మరణజేయుచు బయలుదేరును. అంద రనున రించి సాగనంపుదురు.)

(తెర జారును)

గీతిక.

ఖరహరప్రియరాగము — ఆదితాళము.

జలజనేత్రానుత । చరణపంకజ
కలభసుందరా । కరుణ నేలరా॥ జ॥
సన్నుతాంగ ముని । సన్నుతచరణా
పన్నగశయనా । స న్నేలర వరదా॥ జ॥

గద్య

ఇది శ్రీమద్వేణుగోపాలవరప్రసాదలబ్ధ సరసకవితాధురంధర దింటకుర్తి
వంశక్షీరార్ణవరాకాసుధాకర కౌండిన్యసగోత్ర కృష్ణమరాజపౌత్ర
పవిత్రగుణకదంబ గంటమాంబా గర్భశుక్తి ముక్తాఫల
వేంకటప్పలరాజ తనూభవ వినయగుణవిధేయ
విద్యాశేఖర బిరుదాంకిత భాస్కరవర్మ
నామధేయప్రణీతంబైన
భారతీయనాటకంబునందు
ప్రథమాంకము.



# భారతీయము

## ద్వితీయాంకము



### ప్రథమరంగము

ద్వారవతిలో దివ్యసౌధప్రాంగణోద్యానవనసీమ

(శ్రీకృష్ణ రుక్మిణీ సత్యభామల ప్రవేశము)

**శ్రీకృష్ణుడు**

ప్రేయసీ, సత్యా! పారిజాతాపహరణమునకన్న తులాభారానంతరమున మీ యిరువురిసఖ్యము నాకుఁ బరమమోదావహముగ నున్నది. ఇప్పటికిగదా రుక్మిణీసత్యభామలైతిరి. (ఇరువురను బాహుమూలలకుఁ జేర్చుకొని అనురాగమును గురిపించును.)

**సత్యభామ**

హృదయేశ్వరా! నాడును నేడును మాహృదయంబులందలి భావంబు లొక్కతీరుననే పరిఢవిల్లుచున్నయవి. మా భక్తిప్రేమల యంతరార్థంబు గ్రహింపనేరక నారదమునీంద్రులుసహితము వ్యత్యస్తహృదయారవిందులై భేదాభిప్రాయంబులతో మెలంగుచు మిమ్ముల నెటుల ద్రిప్పిన నటుల మెలగుచుందురుగాని భక్తికిని ప్రేమకును భేదమున్నదనియా? భక్తియే ప్రేమ; ప్రేమయే భక్తి. (అని యిరువురును పింఛమును, మెడలోని హారములను సవరించుచుందురు)

**శ్రీకృష్ణుడు**

ప్రియతమా, సత్యా! నీవు వచించినది నిక్కువము. అపరిమితమైన వలపుహృదయము మనోమార్దవమునగాని కలుగదు. హృద

యము నవనీతవదృశమైనగాని ప్రేమ కుదురదు. ప్రేమ కుదిరినగాని భక్తి పట్టుబడదు. కామ్యవదవుల నాసించునది ప్రేమకాదు. దీనికి నీ వే మందువు? (అని మృదువుగా యిరువురిబాహువులు నవరదీయును.)

రుక్మిణి

ప్రాణేశ్వరా! సోదరి యడిగిన ప్రశ్నంబునకుఁ జాలినంత సమాధానము చెప్పి యొప్పింప వలయును గాని ప్రేమ స్వార్థకాంక్షి యనియు, ప్రేమ గుడ్డిదనియు, వలవు రూప మనియు మీ చతురోక్తులచే యుక్తులు బన్ని సమాధానపరుప యత్నించుట మీ లీలావినోదభాసుర వ్యక్తిత్వమును గనబరచుకొనుట. (అని యిరువురు చికురజాలము నరిజేయుదురు.)

శ్రీ కృ ష్ణు డు

అర్ధాంగీ, రుక్మిణీ! ఇందు లీలామానుషవ్యక్తిత్వముచే సమాధానపరచు ప్రయత్న మేమున్నది? లోక మంతయు ప్రేమమయము.

సీ॥ జలజాప్తు దీప్తిచే ♦ జలజంబు వికసించు
చంద్రకాంతికి శిలల్ ♦ జలదరించు
నీలాంబుదధ్వని ♦ నెరిగి గేరు నెమళ్ళు
నవవసంతమునకు ♦ నలరు బికము
యమునానస్రవంతి వంర్షమున గానము జేయు
కోడెతాచులుఁ బాట ♦ గోరి వినును
భ్రమరంబు సుమమును ♦ వరికించి వలపించు
గాలిలో విహరించు ♦ ఖగచయంబు

తే॥ గీ॥ నైజమా లేక యట్లు ♦ యానందమున క
టంచు బలుకుదువా ప్రేమ♦దనము కొరక,
భక్తికోసమ? వల్కుమా ♦ వడతి! ప్రేమ
భక్తులకు భేద మినుమంత ♦ బలుక వశమె?

## సత్యభామ

(కృష్ణుని చేతులు మృదువుగా నిమురుచు) మనోహరా! నిక్కమువక్కాణించితిరి. అనుజీ! సందేహమెందులకు? భగవంతుడు ప్రేమమయుడు. ప్రకృతి ప్రేమమయము. నీనందియము సంపూర్ణముగా దీరినదా? సృష్టికి మూలము ప్రేమయేగదా!

## రుక్మిణి

నెచ్చెలీ! ప్రేమప్రభావము సంపూర్ణముగా గ్రహింప గలిగితిని గాని, నీహృదయవిశాలత్వమున కచ్చెరువందుచుంటిని.

చ॥ హృదయము మాధవు న్పదసరోజము వీడదు ప్రేమ యన్న నో
వదమలగాత్రి! నాథుని ప్రసాదము గోరును కృష్ణు నన్నుగా
నొందవగ జేయు నెంతటి మహోన్నతశక్తిమయంబు ప్రేమ నా
యెద నిలు దా నజస్ర మటు హేతువు దెల్పుము నేడు నెచ్చెలీ!

## శ్రీకృష్ణుడు

(ఇరువురను దగ్గరకు దీసికొని భక్తహృదయము కన్న ప్రేమహృదయము మిక్కిలి మార్దవము. ప్రేమచేత జయింపబడని దేదియు నీ విశ్వమునందు గోచరము గాదు ప్రేమచేత మృత్యువును సహితము జయింపవచ్చును. ఇంతయేల? పిపీలికాదిబ్రహ్మపర్యంతముగల చరాచరములకు ప్రేమయే యాధారము. ఇందులకు సందియ మొంతమాత్రమును లేదు.

## రుక్మిణి

సోదరీ, సత్యా! నాథుడు వచించినది యథార్థము.

మ॥ తరుణీరత్నము ప్రాణనాథు కొరకై దారిద్ర్యము న్పొంది భీ
కరవింధ్యాటవి నారచీరలను వేడ్కం దాల్చునా డట్టి దు
ష్కరమా వైతరణిన్ దరించి యముతోఁ గర్వించి సావిత్రి దా
వరునిన్ బొందగ లేదె? ప్రేమయన నావామాక్షి నీక్షింపమే.

స త్య భా మ

సహోదరీ! ప్రేమహృదయజీవనులకు తమ జీవిత మంతయు నానందమయమే గాక మరియు విపులసమ్మోదసుఖకర......

(నారదుడు ప్రవేశించుచుండును)

నా ర దు డు

ఉ॥ అంబరమంటు గోపురము ♦ లల్లవిగో యదె రాజకోట పీ
తాంబర దివ్యసౌధముల♦యం దలరారెడి యాదవాళి కా
దంబర నీరజాత బక♦తావకమా జలరాశి యయ్యదే
నంబర మయ్యొ ద్వారవతి ♦ చందము జూడ కృతప్రయత్నతన్.

శ్రీ కృ ష్ణు డు

(వినుట నభినయించి) సతీమణులారా! యెక్కడిదీ దా దివ్య గీతారవంబు. (నారదుడు పాడుచునే యుండును.)

రు క్మి ణి

జీవితేశ్వరా! విపంచీమానికంబైన మహతీ ధ్వనియనియు, యీ మధురకంఠగీతారవయుతంబగు గానంబును మీకు స్మృతికి వచ్చుట లేదా?

నా ర దు డు

(ఎదుటకు వచ్చి)

సీ॥ పతిశాపవశమున ♦ బడి శిలాకృతి నున్న
కలికిమిన్నను వడి ♦ గాచె నెద్ది
రాధావధూటి యు♦న్నత కుచాగ్రములందు
కస్తూరి రజముతో ♦ గ్రాలు నెద్ది
యల రమాదేవి యు♦న్నతకటిస్థలి నంటి
విమల గౌరవముతో ♦ వెలసె నెద్ది
జనకాబ్ధిరాజులు ♦ సంతోషమున కన
కంపు పళ్ళెరముల ♦ గడిగి రెద్ది

తే॥ గీ॥ ఫణిఫణాగ్రాళి మెఱయంగ • బరగె నెద్ది
భక్తులకు తారకంబుగా • పరిబలె నెద్ది
యట్టి నీ పాదుకాంబుజ • మమలగతిని
గొల్వగా నేడు నమకూడె • కోమలాంగ!

యదుకుల దుగ్ధాబ్ధి నిశాకరా, దామోదరా! తావకీయ సుం
దర వదనారవింద సందర్శనంబున నే నమందానంద కందళిత హృదయా
రవిందుండనై తిని. మీకు శుభోదర్క మగు గాక! (మువ్వురు యెదురేగి
దోడ్కొని వత్తురు.)

శ్రీ కృ ష్ణు డు

నయగుణవిశారదా, నారదా!

ఉ॥ పావన మయ్యె మద్గృహము • భావిఫలోదయభాగ్య మబ్బె శో
భావహ త్వత్పదాబ్జము శుంభఁబని బెట్టిన మానిచంద్ర! నం
భావితమైన స్వర్గపరిపాలన సాగున నిందురిదక్షతక్ష
ధీవినుతప్రభావ! భవదీయ జనావళి కెల్ల మోదమే.

నా ర దు డు

శిష్టరక్షణ దుష్టశిక్షణ దక్షుండ వగు నో పుండరీకాక్షా! నీవు
లోకంబుల సంరక్షింపుచుండ మా ఋషివర్గంబున కే కొఱంతయు గలు
గదు. భవదీయసుందర మందహాసాంచిత వదనారవింద సందర్శనమున
కన్న మా యాగమంబునకు కారణ మేమి యుండును?

రు క్మి ణి

మరల నే జేదియైన భక్తుల పరీక్షింప దలచిన కలహ కారణంబు
లుండవు గదా! గంధర్వసార్వభౌముండగు గయునకు కల్పించిన కష్ట
ములు దలంచినచో వజ్రకాఠిన్యసదృశం బగు హృదయంబులు సహి
తము యగ్ని సందర్శనం బగు నవనీతంబు కరణి ద్రవింపక మానవు.
శాంతి దమాది గుణయుతులును, నిరంతర భగవ న్నామ సంకీర్తన
పరులును, సత్యవ ర్తనులును నయిన పరమ భాగవతోత్తము లగు భక్తు
లను పరిశోధింప నేల? ఇది మీా నిత్యజీవనమా?

నా ర దు డు

అమ్మా, రుక్మిణీ! పరమపావనులగు భక్తహృదయంబులం గల నిర్మల శాంతి శమదమాది గుణ విమర్శనంబుల బాల్గొందుము గాని, భక్తుల యెడ నెన్నండును విపరీతభావంబు గలుగదు. ప్రపంచాదర్శంబుకై ప్రకటింప భక్తుల యప్రతిమాన సహాన శక్తియు, శాంత ప్రవర్తనయును, అజరామరత్వంబును లోకంబుల ప్రకటింప నట్లుజేయుచుందుము గాని భక్తులగు మహాత్ములపై మా కలుకయా?

స త్య భా మ

కాంతిజితశరన్నీరదా! నారదా! మరల నే డేదేని మాయావ్రతంబు సంకల్పించుకొని రాలేదు గదా! (కృష్ణుడు నవ్వుచుండును. మిగిలిన వారు తదనుసారముగా నభినయింతురు.)

నా ర దు డు

పతివ్రతాశిరోమణీ! నేడు లీలామానుషవిగ్రహుండగు వేణుగోపాలునిపై గల ప్రేమలతాళి ప్రపంచంబునం బ్రసరింప జేసి సకల నారీలోకమునకు నీ సౌశీల్య వినయాది దివ్యగుణంబులు వెల్లడి జేయుటకే గాని అన్యథా మరియొక వ్రతవిధానము గాదు సుమా!

శ్రీ కృ ష్ణు డు

గానవిద్యావిశారదా, నారదా! కురుక్షేత్రసంగ్రామానంతరమున యుధిష్ఠిరునకు సామ్రాజ్యాభిషేక మొనరించితిమి. పిమ్మట వారి క్షేమవిధానంబు తెలియంగ గావు. భారతవర్షంబునందలి రాష్ట్రపాలకుల యభిప్రాయంబు లె ట్లున్నవి? దేశ మన్నివిధముల సుఖోన్నతమై యొప్పునే?

నా ర దు డు

(స్వగతము) వెదుకబోయిన తీగ పదములకు జుట్టుకొనినయట్లిచ్చటంగూడ నాయూహకు దోహద మిచ్చు ముచ్చటలే వచ్చుచున్నవి.

(ప్రకాశముగ) కృష్ణా! వినఁగోరితివేని సీయుప్రతిమానుగ్రహమున పాండవేయులకు ఖండనంబున జయంబుగల్గెగాని భీష్మ ద్రోణ రాధా తనూభవధార్తరాష్ట్ర శతయోధపరికల్పిత మొగ్గరంబుల నిర్జింప పాండు కుమారులకు దుస్సహంబు.

శ్రీ కృ ష్ణు డు

ఈ మొదలుగాఁగల విషయంబులన్నియు కర్ణాకర్ణికగా నాకర్ణించుచునే యుంటిని పాండవేయుల భావంబు లెట్లుగాఁ బరిణమించుచున్నవి? రాజ్యమదాంధత్వము లేక సూత్రశాసనములచే నమాయకులగు ప్రజలస్వతంత్రంబుల చరిపట్టక సకలవిభవ సమేతుల మని గర్వపడక, ప్రజల బిడ్డలరీతి గాపాడుచు, మ మ్మెన్నఁడైన దలంచుచుందురా?

నా ర దు డు

సకలలోక కారణా, యాదవకులాభరణా! పాండవులు సకలవిషయంబులందును జాగరూకులేగాని మీయెడలమాత్రము కొంచె మ... న్య...థా...ప్రవ...

శ్రీ కృ ష్ణు డు

మాయెడల నన్యథా ప్రవర్తింపుచుండిరా? పాండవు లందరూనా లేక కొందరు మాత్రమేనా? నారదా! సందేహింపకమాత్రము తెల్పుము.

నా ర దు డు

ఆర్తత్రాణపరాయణా, నారాయణా! జ్ఞాతివధచే సంభవించిన పాతకంబునకు అజాతశత్రుండు పశ్చాత్తాపితహృదయుం డగుచు పరితపించుచుండ నంత మహాత్ముం డగు శ్రీకృష్ణద్వైపాయనుం డరుదెంచి యశ్వమేధనిర్వహణానంతరమునగాని మీ కీపాప మువశమింప దని తత్క్రతువిధానవిధి నుపదేశించి తత్సవననిర్వహణంబునకు భగవంతుం డగు వాసుదేవు నాహ్వానించిన యమ్మహాత్ముని నిర్హేతుకజాయమానకరుణా

కటాక్షవీక్షణంబున తత్క్రతువిధానంబు నిర్వర్తింపగల రని హితోపదేశంబు గావించెను.

శ్రీ కృ ష్ణు డు

అందులకు ధర్మజుం డేమి ప్రత్యుత్తర మిచ్చెనో తెల్పుము.

నా ర దు డు

శ్రీమన్నారాయణుం డగు వాసుదేవు నాహ్వానింప నీ వరుగు మని శతక్రతునందనున కాజ్ఞాపించెను. అంతట నా సవ్యసాచి వ్యాసుం డుండె నని జంకక, నే నుంటినని గొంకక భారతరాష్ట్రశతకల్పితయేకాదశాక్షౌహిణీ నిర్మూలనబాహుపరాక్రమవిక్రమోపేతు లగు యనిలజార్జును లుండఁగా గాండీవాని తెఱంగున మెలంగు నీ వల్లగొల్లనివలన నే మగు ననెను ?

స త్య భా మ

హృదయేశ్వరా ! వింటిరిగదా, పాండవులప్రల్లదంబులు ! ఆ విశ్వాసఘాతకులను నమ్మవచ్చునే ? అందులకే—

చ॥ అరయఁగ బాంధవాళిసద • నంబులకు న్మది సంశయింపకన్
తరచుగఁ బోవరాదు, వడి • దర్లిన లాఘవదృష్టిఁ జూతు రో
వరసిజనేత్రి ! యల్లు జనఁ • జాలదు నెంతటివారికైన యా
మురిపె మెఱుంగలేసి తన • మోదము జూపిన గోప్య ముండునే.

అని ఆ నాఁడు వచించితిని. యుష్మత్ప్రచారవిధివిధానంబు లిది వర కెన్నఁడో యుగ్గడించియుంటి.

శ్రీ కృ ష్ణు డు

సత్యా ! నారదాభిమతవిధానంబు సాంగోపాంగముగా విననిమ్ము. నారదమునీంద్రా ! తరువాత నెఱింగింపు మా యనమర్థుం డగు పార్థుం డే మనెనో—

నారదుడు

దీనశరణ్యా, కృష్ణా! అందులకు వ్యాసధర్మజులు వారించినను వినక, పార్థుండు—

తే॥ గీ॥ కుధరపక్షంబుల న్గాల్పఁ ♦ గోరుసేని
దివ్యవజ్రాయుధమె వడిఁ ♦ ద్రుంచుఁగాని
యహహా! చరణాహతిం గొన్న ♦ యాదవుండు
యశ్వమేధంబు నమకూర్చ ♦ నర్హుఁ డగునె?

రుక్మిణి

ప్రాణేశ్వరా! వింటిరా, బల్లిదులప్రల్లదంబులు.

సీ॥ అలనాఁడు వారణా♦వతమందు రక్షింప
నది నేటి కిల్లుగా ♦ నవతరించె
కులసతి సభలోన ♦ కురులు బట్టీడ్వంగఁ
బాలింప నది యిట్లు ♦ పరిణమించె
మేనత్తతనయుఁడే ♦ మేలు భద్రి కటంచు
నిచ్చి పెండిలి సేయ ♦ నింత కలిగె
క్రిమత రాజ్యాభిషే♦కము జేయ నీ నాటి
కింతగా మనయందు ♦ నెగ్గుఁగలిగె

తే॥ గీ॥ నెవని కే రీతి యుపకార ♦ మీయఁదగునో
యటులఁ జేయంగవలయును ♦ నంతెగాక
యింటిదీప మటంచు ము♦ద్దిడిన మూతి
కాలకుందునె తెల్పుమా ♦ కమలనేత్ర!

శ్రీకృష్ణుడు

ప్రాణేశ్వరీ! శాంతితో నుండి సాంతముగా నారదునివల్కు లాకర్ణింపుము. సురమానినీంద్రా! బాహుబలపరాక్రమోపేతుఁ డగు భీమసేను డేమి పల్కెనో యది గూడ వక్కాణింపుము.

సత్యభామ

అట్లు బల్కిన తమ్ముని కన్ను దీసిపోవుననియా మీయాశయము?

శ్రీకృష్ణుడు

కల్యాణులారా! సాంతముగా వినక మీ యధికప్రసంగమున కేల పూనుకొనెదరు? నారదా! వచింపుము. మరల మరల భీమసేనుఁ డే మనెను?

నారదుడు

చ॥ అల జరపుత్రు గోడి మధు•రాపురి వీడి సమస్తబాంధవా
వళిఁ గొనిపోయి సంద్రమున • వారక నిల్గొను యాదవుండు మే
మిల నొనరించు నధ్వరము • కేగతి నూతగ నిల్చువాఁడు మీ
పలుకులు చాలుఁజాలు నిక • బావ యనన్ జనఁగూడ దగ్రజా!

అన అందులకు భీము వారించుచు నే నిట్లు బల్కితిని.

రుక్మిణీసత్యలు

(ఏకకంఠముగా) ఏ మని?

నారదుడు

సీ॥ అల జరాసంధుని • నాహవంబుననుండి
యులసి పోవఁగ నేమి • సలిపె నొక్కొ!
ధృతరాష్ట్రుమది నిను • ద్రుంపఁ బ్రయత్నింప
నీ కది తప్పింప • నేమి జేసె?
పడతి నొప్పింప నీ•బలము చాలనివేళ
నయము గాకున్న దా • నడ్డుపడియె
ఖండనమున ప్రతి•జ్ఞాపాలనము సేయ
మీ కెన్నిరీతుల • మేలుఁజేసె

తే॥ గీ॥ ఆ మహాత్ముఁడు మీయండ నలరి సర్వ
సుఖము లొనఁగూర్చి మిము కృపఁజూడకున్న
భరతవర్షంబుఁ బాలింప నేరయ నగునె
గాన నుపకారి మఱువంగఁ గాదు జగతి.

అని యనుటతోడనే చెట్టుచెడుసమయమున కుక్కమూతిపిందెలు బుట్టినటుల తుద కీదుర్బుద్ధులు బుట్టినవా యని భీమపార్థులతల కొకమాట నిందించిరి. కృష్ణద్వైపాయనుఁడుగూడ మందలించి యశ్వమేధవిధానంబు సంపూర్తిగాఁ దెల్పి తనతపోవనంబున కరిగె. అంత ధర్మజుఁడు తమ నాహ్వానింపఁబోవలసిన దని భీమపార్థులకుఁ బ్రత్యేకవిధ న్దెలుప నా యిరువురు మిన్నకున్న విదురుని తమపాలికిఁ బంపిరి. నా యెఱింగిన యథార్థము లివి.

## శ్రీకృష్ణుడు

నారదమహాసీంద్రా! యల్పులకు హితమొనర్చుటయు నొకప్పుడు యాత్మవినాశము నొందుటకే యని మన మూహింపవలసియున్నది. భీమపార్థులగర్వంబు నాకుఁ బ్రథమమునుండియుఁ దెలియును అయినను బాంధవుండ నగు నన్నుగూడ వేఱుగాఁ దలంతు రని స్వప్నమునందైనను నమ్మియుండలేదు. నా యవివేకమును నేను నిందించుకొనవలయునా? కృతఘ్నులై నన్ను నిందించిన గర్వపోతుల గర్వ బు సర్వంబు ఖర్వంబు గావింపవలయునా? ఔరా, భీమా! పిఱికిపందనై జరాసంధున కోడి పారిపోయి సముద్రంబున దాగితినిగా? ఆహా! నా విలాసనిర్మాణము మీకు నిందాపన్మృతిగాఁ బరిణమించినదా? ఓరీ, శ్వేతవాహనా! యబలపాదాహతిని బడ్డ యాదవుండనుగా? తుచ్ఛులారా! మీభక్తి వినయస్నేహబాంధవంబులు నిశ్చయము లని నమ్మి రాజసూయాధ్వర నిర్వహణసమయముమొదలు ధర్మజు రాజ్యాభిషేకమహోత్సవసమయమువరకు మీ కొనరించిన యుపకారంబు లన్నియు నింతలోనే యపకారంబులుగాఁ బరిణమించినవా? పాలుద్రావి పాలిండ్లుమొత్తు గుణంబు లెచ్చట నేర్చుకొంటిరి? వ్యాసమహాసీంద్రు లనినటుల మీకు విపరీత

కాలము తటస్థించినయే మీకీట్టి దుర్బుద్ధులు బుట్టినవి. నారదమహామునీంద్రా! దీని కుపాయ మాలోచించి వచింపుము. (రహస్యముగా) నాటి యార్యశిశుపవర్యవసాన వివిధంబుగాఁ దీర్చుట మంచి దని నాయూహకుఁ దోచుచున్నది. తమ రేమందురు? (స్త్రీలకు దూరముగా నడచుచుందురు.)

నా ర దు డు

(రహస్యముగా) అందులకే నే డిట కరుదెంచితిని. (పైకి) కృష్ణా! రాజకీయనిపుణులును, భండనపాండితీప్రతిభాశాలురును నగు నీ దేవేరు లుండ బడుగుజడదారి నగు న న్నడిగెద వేల? అయినను యుపాయ మాలోచించునది నేనా? హిత ముపదేశించునది నేనా? కృష్ణా, యెంతవాడవు?

చ॥ తెలియనివానిరీతి నను • దెల్పు మటంచును బల్క నేల? యీ
జలరుహగర్భుఁ డీ భువన•జాలము గారవించి కందుకం
బులుగ విలాసవైఖరుల • బాల్పుగఁ ద్రిప్పుచునుండుగాన యో
నళినవిశాలనేత్ర! సుర•నందిత! గోపకుమారశేఖరా!

స త్య భా మ

హృదయేశ్వరా! ఇందు కుపాయ మే మున్నది? భీమపార్థుల మదగర్వంబు సర్వంబు ఖర్వంబు గావింపవలయు. అప్పుడుగాని వారికి మీ మహిమ తెలియదు.

నా ర దు డు

ఆర్తత్రాణపరాయణా, నారాయణా! నాయభిమతముగూడ సత్యాదేవి వచించినదే.

శ్రీ కృ ష్ణు డు

ఆ మిత్రద్రోహులగర్వ మడంప దామును నుండవలయు నని గోరుచున్నాను. తగినవిధాన మిప్పుడే యాలోచింపవలయును. లేకున్న మోసము వాటిల్లును.

తే॥ గీ॥ పరివిమలానందచందన • పాదంబు
మూలమున బుట్టి పెరిగెడి • ముష్టిపొదను
పరిబలకుండఁగ దుంపిన • బరమసుఖము
పెరుగ శ్రీమమున గొడ్డంట • నరుకవలయు.

(నారదుఁడు నడచుచుండ కృష్ణుఁ డనుసరించుచుండును)

నా ర దు డు

ఇప్పు డా భీమార్జునులకడ కే వేషంబులఁ బోవలయును? ఎరుక గనఁజాలకుండ నుండవలయు.

శ్రీ కృ ష్ణు డు

దేవర్షి చంద్రమా!

తే॥ గీ॥ గారడీలతెరంగున • కపటవేష
మును ధరించుక నీవు ఢోలును నమర్చ
నేను నుపకరణంబుల • నెత్తుకొనుచు
సభకుఁ బోదము నారద • సంయమీంద్ర!

నా ర దు డు

ఈ వేషంబుల మన మొనర్పఁబోవు నింద్రజాలతంత్రంబునకు నయ్యిరువురే గడంగుదు రని మన మెట్లు నిశ్చయింపవచ్చును?

శ్రీ కృ ష్ణు డు

నారదా! యింకనూ నీ మనంబున నందియంబుగూడనా?

చ॥ జగములనెల్ల గారడిమి • మస్థితి బంతులయట్లు దిప్పు ము
జ్జగములవా రెఱుంగుదు ర • సాధ్యముగా దది సంశయింపఁగా
దగునొకొ! పార్థభీమకృత • తంత్రముల న్దెలియంగ వచ్చె నా
మగటిమి జూప కింక యను • మానము జేయగ నేల తాపసా!

గర్వాభోతు లింగితమును గమనింపలేరు. అందుమూలమున మన ప్రయత్నము సునాయాసముగ నెరవేరును. (ఇంతవరకును రుక్మిణీసత్యలు మాటలాడుకొనుచునే వినుచుందురు)

స త్య భా మ

అనుజీ! దీని పర్యవసాన మేమై యుండును? నీ మన మెట్లు ప్రబోధించుచున్నది?

రు క్మి ణి

సోదరీ! గంధర్వ సార్వభౌముండగు గయుని కరుణింపను పాండ వేయుల బలపరాక్రమ ధర్మ నిష్ఠా గరిష్టత్వములు ప్రకటించుటకును నా డెంతో సంగ్రామ కలాపంబులు జరిగెనో నేడును నంతియే యని దోచు చున్నది. మహామహిమోపేతుం డగు నీ మహాత్ముని మహామహిమలు మహామహులకే తెలియ నలవిగాని యప్పుడు మన మూహింప నెంత వారలము! అయినను చూచుచుందుము గదా!

స త్య భా మ

సోదరీ! యేదియైనను కలహాభోక్త యైన యీ నారదమౌని మనలను గలిపి యీ కపటనాటక మాడించును గదా!

రు క్మి ణి

బాలా! యెంత బేలవు? ఆడించిన దప్పును గనుకనా? ఇందు లకు మన యజ్ఞాన మున్నప్పుడుగదా, భయపడవలసిన యవసరము. లేనిచో మన కేల నీ యాందోళనము?

స త్య భా మ

(అటు జూపించి) ఏవియో చిదంబర రహస్యములు జరుగుచున్నవి. మనము గూడ నుందమా?

రుక్మిణి

అదుగో ఆర్యపుత్రులు నారద మాహీంద్రులును వచ్చుచున్నారు. అంతదనుక మన మేల తొందర పడవలయును?

శ్రీకృష్ణుడు

కాబట్టి మనము తప్పక కపటవేషములనే యరుగవలయును? మీ రెంతమాత్రమును సందేహింప నవసరములేదు.

రుక్మిణి

హృదయేశ్వరా! నారదమాహీంద్రులు దెల్పినటుల సహదేవుని ప్రతిభను యొక్కింత యూహించియే మీ యుద్యమమునందు ప్రవేశింపవలయునని నా యాశయము.

శ్రీకృష్ణుడు

సతీ, రుక్మిణీ! నే నూహింపకయే యీ కార్యము నిశ్చయించితి ననియా నీ యభిప్రాయము.

సత్యభామ

మనోహరా! వీరిరువురి భావ మొకింత భీరుత్వమును సూచించు చున్నది. భీమార్జునుల కెంత ధనుష్పాండిత్యము గల్గిన గల్గుగాక! మీ యపార కరుణా రస వీచీపరంపరల నోలలాడించిన జయము గొనుట త్రిలోకవిదితము. లేకున్న వా రెట్టివిజయమును బొందజాలరు.

శ్రీకృష్ణుడు

నారదా! నిశ్చయము. నిత్యశంకితము మనకు బనికిరాదు ప్రథమమునం దనుకొనిన కార్యక్రమమునే సాగింతము. (ఆలోచనగా) మీ రిప్పట్టున నరిగి (రహస్యముగా) ఊర్వశితోఁ దెలుపవలసిన విధానము నంతయుఁ దెలిపి రేపటనే మీ రరుదెంచవలయును. (పైకి) మీరు రానిచో విషయము బహిర్గతమైన మరల పురస్కరించుకొనుట మిగుల దుష్కరము. (నారదుడు ప్రయాణ మగును.)

రుక్మిణి

నాథా! ఆతిథ్య మీయకనే మునివర్యాసీందు్రల నంపిన—

నారదుడు

అమ్మా! అవసరమగు కార్యము లున్నప్పుడు కార్యాతురులకు ఆతిథ్యముల మాట దోచునా? (నవ్వును)

శ్రీకృష్ణుడు

(ధీరముగా) నిశ్చయము.

సత్యభామ

ఎంత అవసర మైనను మహాత్ముల నటు లనుప వచ్చునా?

నారదుడు

నారీశిరోమణులారా! మీ యాదరమును మీభక్తివినయసేవాదిరతియు నా హృదయరంజకం బయ్యె. యిప్పటికి నన్నానపజనదు. కృష్ణా, దేవాధిదేవా! సెలవు (హరిం దలచుచు నిష్క్రమించును.)

శ్రీకృష్ణుడు

సతీమణులారా! మాటల ధోరణిలో కాలమును మరచితిమి. పోదము రండు. (అనుచుండగా ప్రక్కనుండి విదురుడు ప్రవేశించును.)

విదురుడు

తే॥ గీ॥ యదుకులాంభోధి పూర్ణశశాంక! భక్త
కమలబాంధవ! ఋషికులకాననైత్రి!
భవతిమిరచండభాస్కర! వనజనాథ!
వందనము నందనందన! వనరుహాక్ష!

ఆర్తత్రాణపరాయణా, నారాయణా!

చ॥ ఎవరి పదాంబుజంబులు జపింపగ సర్వసుపర్వకోటి సం
భవమువనుండి కాంక్షబడి పావను లౌదురు; దేవదేవ! యా
దవకులభూషణా! యచలధారణ! యట్టి భవత్పదాబ్జముల్
భవనుత గంటి నేడు పరిపాలనజేయవు భక్తరక్షణా!

శ్రీ కృ ష్ణు డు

పరమభక్తాగ్రేసరా, విదురా! లెమ్ము లెమ్ము. భవదీయాగమ నంబు మాకుఁ గడుంగడు ముదావహము.

ఉ॥ ఎచ్చటనుండి యెచ్చటకు • నేగుచు ని ట్లరుదెంచినావు నీ
సచ్చరితంబు పావనము • చయ్యన దెల్పు భవత్ప్రియంబు నే
మెచ్చెద, పాండవుల్ సుఖులె • మేలె సమస్తము బాంధవాళికిన్
సచ్చరితాగ్రగణ్య! యట • సంగతులెల్లను దెల్పఁగోరెదన్.

వి దు రు డు

సకలలోకపరిపాలనదీక్షా, పుండరీకాక్షా! తమ రెఱుంగని దే మున్నది? ఈ పత్రికం గాంచిన విశదమగును. (ఇచ్చి నమస్కరించును.)

శ్రీ కృ ష్ణు డు

ప్రియసీ సత్యా! ఈ లేఖను విస్పష్టముగా స్పష్టీకరించుము. మేము సడచుచు వినుచుందుము. (రుక్మిణిని తనదుస్సును బట్టవలసినదిగా సైగజేయును) విదురా! మనము ప్రాసాదమునకు బోవుదము రమ్ము. (వెనుక రుక్మిణి, ఒక ప్రక్క విదురుడు, మరియొక ప్రక్క లేఖ విప్పుచు సత్య నడచుచుందురు.)

స త్య భా మ

దండకము—శ్రీవాసుదేవా! హృషీకేశ! గోవింద! నారా యణా! పీతకౌశేయవాసా! ఘనశ్యామసంకాశదేహా! ముకుందా! మురారీ! రమాలోల! వైకుంఠవాసా! సదానచ్చిదానంద! వేదాంత వేద్యా! గదాశంఖకౌమోదకీచక్రదివ్యాయుధానంత శస్త్రాస్త్రసంక్షిప్త బాహుప్రభావాంతరీభూతదైతేయదుర్నీతగర్వాంధనిర్వేదవైరివ్రకాండా! ప్రచండాద్భుతా! పుండరీకాక్ష! దేవాధిదేవా!

శ్రీకృష్ణుడు

సత్యా! యీ విశేషణములన్నియు తరువాత పఠింపవచ్చును. కానీ ముందు కర్తవ్యతావిషయ మెచ్చట నున్నదో యచ్చటనే ప్రథమ మందు పఠింపుము.

రుక్మిణి

నాథా! యిందు తొందరేమున్నది? సావధానముగానే యాకర్ణింపరాదా!

విదురుడు

మహానుభావా! అమ్మగారు వచించినటుల జేయుము. దేవర వారి పాలితులుగదా!

శ్రీకృష్ణుడు

నీతికోవిదా, విదురా! అవసరము వచ్చినప్పుడైనను వారికి మేము ఆరాలో యుండుట మాభాగ్యముగదా!

విదురుడు

మహానుభావా, వాసుదేవా! ఎంతమాట? తమ పాదరేణువులు అనుగ్రహామునకుఁ బాత్రులు గారు.

సత్యభామ

అనుగ్రహామునకు బాత్రులయిన ఆ......

శ్రీకృష్ణుడు

సత్యా! తొందర యేల? తరువాత పఠింపుము.

సత్యభామ

(దండకము చదువుచుండును) నగారాతి గంధర్వసిద్ధామరాభోగి విద్యాధరాయక్షసాధ్యాసురానీక సంస్తుత్య దివ్యప్రభా! గోపనంరక్షణా! సాధుసపోషణా! కృష్ణ కృష్ణా! మహావిష్ణు! శ్రీవత్సకేయూరకోటీర

మాణిక్యహేరాళహీరాసంకీర్ణసౌవర్ణహారాద్యలంకార! శృంగారపీఠాం బరా! దేవదేవేశ! మే మిద్ధరన్ జేయ నున్నట్టి యశ్వాధ్వరం బేవిధానంబు చేనైన జేయింపగా ప్రార్థనల్ జేయుచున్నార మోదేవ! యెట్లైన తా మొక్కపర్యాయ మింపొందగా మాదు విజ్ఞప్తి నాలించి మాగేహదేహ బుల న్పావనంబొప్పజేయంగ రా వేడుచున్నార మో—

శ్రీ కృ ష్ణు డు

అశ్వమేధక్రతు ప్రారంభమునకుఁ బ్రథమదివన మేది?

వి దు రు డు

తమ రఱుదెంచినపిమ్మటగదా, దాని నిర్ణయము!

స త్య భా మ

అది నిర్ణయించుటకు మే మెందులకు? బాహుబలశాలు లగు భీమార్జును లుండిరిగదా!

రు క్మి ణి

(తనలో) అబ్బా! సత్యకుఁ దొందర ఆగదుగదా! (పైకి) శాస్త్ర వేత్తలయిన పెద్దలచే నిర్ణయము కాలేదా?

వి దు రు డు

క్రతువిధానము దెలిసికొనిరి. కాని యజ్ఞనిర్ణయము కాలేదు. అది నిర్ణయించుటకుఁ దామంద రరుదేరవలయునుగదా!

శ్రీ కృ ష్ణు డు

సరియే! తరువాత పఠింపుము, సాంతముగా.

స త్య భా మ

(దండకము చదువును) పాపపంకంబునం దున్న మమ్ముఁ గటాక్షించి రక్షింపవే మాదు లోపంబులెల్లన్ దయంజూచి మన్నింపవే బాల్యకాలంబునం దుండి యుష్మత్కృపానౌకయం దుంచి సంసార

పాథోధియందు న్నమము న్నించకే దేల్చి పాలించితౌ పక్షిరాడ్వాహా! పుణ్యాయ శ్రీశా యనంతాయ గోపీమనోనాథ శ్రీవేణుగోపాల రాధా మనోలోల లీలావిలాసా! యిలానేత! శ్రీసత్యభామామనోపద్మభాను ప్రకాశా! జగన్నాథ! శ్రీరుక్మిణీలోల! సర్వగ్రహారూపిణే! భీష్మ ముక్తిప్రదా! లోకసంతప్తితా! రమ్ము వేంచేయుమో వేణుగోపాల కృష్ణా! నమస్తే త్రిపాదాయ కృష్ణాయ నమస్తే యాదవేంద్రాయ కృష్ణా నమస్తే నమస్తే నమస్తే నమస్తే నమః (అందరు తలలు వంచి నమస్కారభావప్రకటన జేయుదురు.)

రుక్మిణి

నాథా! ధర్మజుని ధర్మగుణ మెంత యొప్పియున్నది?

సత్యభామ

అక్కా! అతివినయం ధూర్తలక్షణ మ్మని నీ వెన్నడు విని యుండలేదు కాబోలు! చంకదుష్ట శిరణాగ్రత్వము.

విదురుడు

అమ్మా! తామే యిట్లు దలంచినచో యిక వారికి గత్యంతర మేమున్నది? దయ జిల్క ప్రార్థించుచుంటిని.

శ్రీకృష్ణుడు

విదురా! వారిమీంద దయజూపంగల సమర్థులమా? అబల చరణాహతిని బడ్డ యాదవుండను; జరాసంధుని నాలంబునం దోడి పారి పోయి సముద్రంబున దాగిన పిఱికిపందను; అట్టి నా దయయా వారికిఁ గావలసినది! విదురా! ఎంతపిచ్చివాడవు? పిల్లి కళ్ళుమూసికొని పాలు ద్రాగినంతమాత్రంబున లోకమంతియు నయనంబులు మూసికొనునా? పూర్వాపరములు దెలియవలదా? ఇంత గర్వమదోన్మత్తత పనికిరాదు. ధనగర్వము శాశ్వతము గాదు. అయినను నన్ను, నిందించునది! యువకారినా దూషణభాషణంబు లాడునది! సరియే కానిమ్ము. నీతివిశారదా,

విదురా! నీ వింగితజ్ఞుఁడవు. స్వపరగౌరవాగౌరవము లెఱింగిన ధీశాలివి. గనుక యిచ్చటి నాయీ పలుకులు మనసునందుననే యుంచుము. తెలిసినదా!

విదురుడు

మహాత్మా! తమనిర్ణయంబునకు వ్యతిరిక్తముగలదా! వారు అపరాధులు. మన్నింపుడు, మన్నింపుడు!

శ్రీకృష్ణుడు

వత్సా! నీవు దగ్గరయుండి అక్రూరునితో శ్రీముఖమును వ్రాయించి యీ మహాభాగునిచేతనే వారల కంపుము. మహాత్మా, విదురా! భోజనాగారమునకుఁ బోవుదము రమ్మ. (స్త్రీ లోకవర్గ్కగాను, శ్రీకృష్ణవిదురు లొకవర్గ్కగాను బోవుచుండ తెరజారును.)

గద్య

ఇది శ్రీమద్వేణుగోపాలవరప్రసాదలబ్ధ నరనకవితాధురంధర దింటకుర్తి
వంశక్షీరార్ణవరాకానుధాకర కౌండిన్యసగోత్ర కృష్ణమరాజపౌత్ర
పవిత్రగుణకదంబ గంటమాంబా గర్భశుక్తి ముక్తాఫల
వేంకటప్పలరాజ తనూభవ వినయగుణవిధేయ
విద్యాశేఖర బిరుదాంకిత భాస్కరవర్మ
నామధేయప్రణీతంబైన
భారతీయ నాటకంబునందు
ద్వితీయాంకము.



# భారతీయము

## తృతీయాంకము

### ప్రథమరంగము

(సాయంసమయము - ద్వారకాపురి పరిసరసముద్రతీరము - పల్లెపాశలు-పల్లెలు వగయిరా - శ్రీకృష్ణ నారదులు)

శ్రీకృష్ణుడు

(ఎదుట పరికించి) మునికులపవిత్రా, బ్రహ్మపుత్రా!

చ॥ అనిశము దంభనాదికము • లాచరణం బొనరించుకొంచు లే
మిని భరియింపలేక పర•మేశ్వరభక్తులరీతి వేషముల్
గొని కపటంబుఁ జేయుచును • కోర్కెఁ జయింపగలేనివారిక
న్నను ఘనమంచు నెంతు మది • నారద! వీనిని నిశ్చయంబుగన్.

నారదుడు

దేవాధిదేవా, వాసుదేవా! నిశ్చయము.

ఉ॥ సుంక మడుఁగ డెవ్వరికి • చుల్కనఁ జేయడు బాటసారి నా
టంక మొసర్ప డెప్పుడును • డబ్బొకటైనను వేడబోడు యో
పంకజనాభ! వీని నిజ•భక్తికి శంకరవాసవాదులున్
శంకొకటైనఁ జేయగనుఁ • జాలరు వీని చరిత్ర మిద్ధరన్.

(దాసు భార్యాపుత్రాదులతో నెదురుగా వచ్చి నమస్కరిం
చును. శ్రీకృష్ణుఁ డందఱను లేవనెత్తును.)

శ్రీకృష్ణుడు

దాసూ! భార్యాపుత్రాదులతో సుఖంబున నుంటివా?

దాను

యేలినోరి దయె ల్లంతా ఇలాన గున్నాము సోమీ !

శ్రీ కృష్ణుడు

దానూ ! మేము సూర్యాస్తమయము గాకమునుపే తీరమునకు జేరవలయును. గాన నావ త్వరగా నడిపింపవలయును.

దాను

అయ్యో, బాబోయ్! యెలాగెల్లి పోదు గేటి? యేను గూకుతుంటే ఇయ్యాల కిట దయసెయ్యాలి. పొయ్యిమీన బువ్వుడుకుతుంది. భోంచేసి పోవాలి మరింగ సోవీ!

ఉ॥ వాలగ శావ దెచ్చి మరి ♦ వట్టిగ నుండు మసాలతోటి ని
యాల మరిన్ని రొయ్యలతో ♦ నచ్చముగా మరి నేతబేల్చి దై
బాలగు మీకు బెట్టుటకు ♦ పంకజనాబ మరెంతో కమ్మగా
యీలుగ వంట జేసితిమి ♦ యీరును మీ రిట నుండి బోవుడీ.

నారదుడు

దానూ! నీ వొనర్చు సపర్యలకు మేము కడుంగడు సంతసించితిమి. నేడు మీగృహమున మేము భోజనభాజనములు జేసినటులగానే భావింపుము. మేము అతిత్వరితముగా బోవలయును గావున నావ త్వరగా సిద్ధపరచుము. నీ వన్యథా తలంపకుము.

దాను

సోవీ! యీ బాపనోరయ్య లేరు బావూ? యేటో దండకాలు మంత్రికాలు నతుకుతారు. యేటి ముచ్చట లేటియ్యి?

కృష్ణుడు

పరమభక్తాగ్రేసరులును, నిరంతరపఠనగీతానందమత్తమధుపానమానసేందిందిరులును, త్రిలోకసంచారులును, గానవిద్యావిశారదులును నగు నారదమౌనీంద్రులు.

దాసు

అలాగేటిబావూ! ఆకె యీరికి పోరాట మెట్టి, వులుదోమిన లింగలా కూకుండే సోము గీరేనా? అందుకే కామోసు, మాయింటికాడ బువ్వతిటానికి సందేగించుతారా బాపనోరయ్యలు.

శ్రీకృష్ణుడు

దానా! పరమపావనులగు దివ్యతపోధనుల నట్లు తేలికగా మాటలాడరాదు. నీకు మాయందు గల భక్తికి చాల ముదమందితిమి. నీభక్తిహృదయంబునకు సంతసించితిమి. మేము మీయింట భోజనము చేయలేదని సందేహింపకుము. (మేను నిమురుచు) పడవ నాయత్తము జేయుము. మమ్ముల నాటంకపరుపకుము. పశ్చిమదిశ గన్గొనుము.

సీ॥ సమయుగారడిరేడు • సంతోషమున నెత్తు
        దళిత పుగడ్డల • ఢక్కనంగ
పంచమస్వరమున • బాటబాడెడు దుంబి
        ఫలముపై నుండెడి • పతక మనగ
పాము లోపలనుండ • పైకి జూపగ దీయు
        ముద్దు లొల్కెడి బుట్ట•మూత యనగ
నూనె గావగ బూని • నుడికింప నెఱసైపె
        పెంపు మీరెడు గాజు•పెన మనంగ
తే॥ గీ॥ పాన్య మొలికింప బలుకుచు • నరుణవస్త్ర
గోప్యమున నుండి జనులకు • కోర్కె లొలుక
పైకి దీసెడు రూకల•ధరిణ యనగ
బరగె నాకాశమున లోక•బాంధవుండు.

కావున త్వరగా నరుగవలయును. లెమ్ము, నావ నాయత్తము జేయుము.

దాసు

దేవరో రలాగ సెలవిస్తే మేమేటి శేసేది బాపూ? బువ్వ తినకుంటే మానె; యిన్ని యేపుడు కొయ్యలైనా దిగిపోదురు బాపూ! (భార్య నుద్దేశించి) బేగి దీనుకు రాయే దానిలో యేసి, రెండాకులు కూడ. బేగిరా (భార్య తేగా యిరువురకు బెట్టును. శ్రీకృష్ణనారదులు దినుచు)

శ్రీకృష్ణుడు

నయగుణ విశారదా, నారదా!

సీ॥ తలిదండ్రి ప్రేమచే ♦ తను బెట్టదగియున్న
మురిపెంపు ముద్దుల ♦ మురువు కంటె
గోపాంగనలు ముద్దు ♦ గోరి తెప్పించిన
ఘనదపాలు, వెన్న, మీ♦గడల కంటె
యింద్రాదివిబుధ వి♦ద్వద్వంద్యమానమై
వలిపిన పాదపూ♦జనల కంటె
పరమతపోధనుల్ ♦ భక్తిను యొనరించు
విమలమౌ సేవల♦విధము కంటె
తే॥ గీ॥ నిర్మలంబౌచు నట్టి ♦ మర్మములు లేక
నీవు నే నను భేదంబు ♦ నెగడనీక
భక్తితోడను నర్పించు ♦ పల్లెవాని
జలజముల గొందు సంతోష♦స్వాంతమునను.

నారదుడు

మహానుభావా, వాసుదేవా!

తే॥ గీ॥ విష్ణుదేవుడ వనుచును ♦ విబుధవరులు
మహానులును సేయు సేవల ♦ మరచి మదిని
నీచసేవల గొందువు ♦ నిశ్చయముగ
వైష్ణవంబుకు తృదరిత ♦ వరలుగాదె!

(దాసు, వాని భార్య తత్కాలోచితముగ నవర్యలు జేయుదురు.)

దాసు

(భార్యాబిడ్డల నుద్దేశించి) ఈనంగా నా వేనుకొని వేగిరండి. సోవు లోర్ని దాటిద్దాము. (దాసు ఉచిత మర్యాదగా రేవుకు దారి తీయును. వల్లెలు భజన జేయుచు వెంబడించుదురు. వారి భక్తిపారవశ్యమును గూర్చి నారదకృష్ణులు ముచ్చటింతురు) ఎక్కో—లెక్క. సోవులోర్ని దాటిద్దాము. (భార్య పిల్ల లెక్కుదురు)

నారదుడు

వాసుదేవా, కృష్ణా!

ఉ॥ చల్లని గాలి పుంజములు • సాగ నమందగతి న్మరాళలే
బిల్లలు తల్లుల న్గలయు • బింకముచూ నూగు తరంగపంక్తిపై
మెల్లననాడు న్సాహ్యగతి•మించి జెలంగెఁ గనుంగొనంగ నం
ఫుల్లసరోజనేత్ర యదు•పుంగవ! కంటివె యీ విచిత్రముల్.

శ్రీకృష్ణుడు

గానవిద్యావిశారదా, నారదా! యస్తంగమిష్యమాణప్రభాకరారుణకిరణపుంజంబు • [illegible]జలాతిరేకస్తమిత[illegible] బ్రహ్మాండకటాహంబున గల సర్వప్రాణికోట్లకు కొంత [illegible] గలుగజేయుచున్నవి!

ఉ॥ హాయిగ వీచు నీ పవన•యానకరము ల్వడి మేను సోకఁ [illegible]
తోయధి మంజులధ్వనుల•తోడ [illegible] మిల్లు నందముల్
జేయుచు నిటిపిట్టలకు • శ్రేయ మొనర్చుచు భూతకోటికిన్
సాయము జేయు నీసరణి • సాగరభావ మెఱుంగ శక్యమే.

దాసూ! శ్రావ్యముగా నొక్క పాట బాడుడు.

దాసు

ఓలె! కలివనండి, నే పాట జెపుతా.

బేహాగ్ రాగము—చాపుతాళము

గోపాలకృష్ణయ్యా నీపాదకమలాలు గొల్చి తరించగనూ
యేపాటి వోలము గావాడి రచ్చించు యేలుము నీవోలము।
కృష్ణయ్యా యేలుము నీవోలమూ॥ గో॥

వదువు లెల్ల వదివి సర్వజ్ఞులైనను వర్వేశ నిను దెలియుగా
విదితము గాదంట వేదవేద్య మే మెంతవారము దేవా।
మహానుభావ యెంతవారము దేవా॥ గో॥
వాచుదే వానంత గోవింద మాధవ వాణీశ నుతచరణా
యీాశ కేశవ వాసుదేవ దేవేశ వాగీశాదినుతచరణా।
రిపుహరణా వాగీశనుతచరణా॥ గో॥
మురహార గోపాల రాధామనోహర మురళీధరా వరదా
నరసఖ కృష్ణయ్య నారాయ ణాచ్యుత నందనందన శౌరీ।
మురారీ నందనందన శౌరీ॥ గో॥

శ్రీ కృ ష్ణు డు

ఇంక నావుము. నెమ్మదిగా నొడ్డు పట్టింవుము. (తీరమునకు రాగా కృష్ణనారదులు దిగుదురు. దాసు భార్యాపిల్లలు నమస్కరింతురు.)

దా సు

(అంజలిబద్ధుడై)

ఉ॥ దండము రాతిశారవణ ♦ దాచుని తప్పుల గాసి నన్ను మీా
యండను జేర్చి గావదగు ♦ యాదవవంశపయోదిశంద్ర మీా
దండ వసింవగల్గినను ♦ దాచున కేవి కొరంత లేదు యో
యండజవాహనా! సెలవు ♦ యన్నిట భారము మీాదె యచ్యుతా!
(అని మాటిమాటికి నమస్కరించుచుండును.)

శ్రీ కృ ష్ణు డు

దాసూ! పరమవిశ్వాసపాత్రుండవైన నీకు శుభములు గలుగు గాక! యిదిగో యిది బుచ్చుకొనుము. (అని రత్నాంగుళీయకము నిచ్చును. దా నది దీసికొని కన్నుల కద్దుకొని భార్యాపిల్లల కద్ది అంజలిబద్ధుడై నిలుచును.) నారదా! యింక రమ్ము పోదము. దాసూ! పోయివత్తుము. మీాకందరకు శుభంబులు గలుగు గాక! (అని నడచుచుండ వల్లెలందరు సాష్టాంగపడి నమస్కరించుచుందురు. చేతులెత్తి దీవించుచు కృష్ణనారదులు నిష్క్రమింతురు. తెర నెమ్మది నెమ్మదిగా జారుచుండును)

## ద్వితీయరంగము

మయసభలో ధర్మజుని కొలువుకూటము

(పాండవులు మొదలగువారు ప్రవేశింతురు.)

సోదరులారా! నాటి సభానంతరమునుండియు నామనంబు ప్రతిక్షణంబును కీడునే శంకించుచున్నది. ఈ హయమేధం బేవిధంబున నెరవేరునో గదా!

భీమసేనుడు

సహోదరా! ఏవిషయంబును గూర్చి మీమనంబు శంకించుచున్నది? హయమేధనిర్వహణమునకు మీకా భయ మేల?

అర్జునుడు

అన్నా, భీమసేనా! ఏ విషయమునుగూర్చి యన నేల?

చ॥ పరువు ప్రతిష్ఠ ప్రాజ్ఞతయు • ప్రజ్ఞ వివేకము నీతిధర్మముల్
వరుసను పౌరుషంబు గుణ•వత్సలతాదిగభీరభావముల్
యెఱుఁగని గొల్లముచ్చును సం•దేహమొయొనర్చితి మంచు నెవ్వ డీ
వరమునిమానసంబున వి•చారముగల్గెను నేడు యర్జునా!

ధర్మరాజు

పార్థా! కన్నుగానక క్రిందుమీఁ దెఱుంగక తారతమ్యంబులు వదలి కృతఘ్నుఁడ వగుచు నేల వదరెదవు? గర్వపోతువై అనుచితభాషణంబులఁ బ్రేలకుము. ఎందు కిట్లు వృథా దూషణాగ్ని పాలయ్యెదవు?

భీమసేనుడు

అగ్రజా! వదరిన నిం కేమి గా నున్నది?

తే॥ గీ॥ పౌరుషంబు ప్రతాపంబు • బలము వదలి
విపినసీమలఁ ద్రిప్పి ప•విత్రమైన
శీలమును దాచి వెనువెంట • స్త్రీని గూర్చి
మరల దిరుగఁగఁ జేతువు • మాన్యచరిత!

అర్జునుడు

అదియును గాను. (ధర్మజు నుద్దేశించి)

తే॥ గీ॥ హృదయ మిచ్చిన యర్ధాంగి • నౌరులసభను
బెట్టి, పుట్టంబు లొల్వగా • బెదరి, మమ్ము
గొనరి యిపు డేమి జేయంగ(•గూడ దనుచు
మరియు కనుసన్న జేయుట • మరచినాము ?

వృషకేతుడు

(తనలో) మరల నిది యేదియో ప్రళయమును సూచించుచునే యున్నది.

కం॥ కావలసిన కార్యంబుల
నేవిధమున నైన బుద్ధి • నెన్నించక యా
కావరపు కూత లేలనొ ?
ధీవినుతుల తెలువు లిట్లు • తెలవారుగదా !

నకులుడు

సోదరులారా! యొందుల కీ వృథా వాగ్వివాదము? పంపిన విదురు డీవేళనే గదా వచ్చునది! ఆయన ముఖమున వృత్తాంత మేదియో తెలిసికొన్న పిదప మనపౌరుషములు జూపుకొనవచ్చును.

సహదేవుడు

(దూరమున పరికించి) అరుగో వ్యాసభగవానులు! తగినయదను... కాదు కాదు. విదురు డరుదెంచుచున్నాడు. ద్వారకాపురీవిశేషములును, బావగారి క్షేమోదంతములును తెలిసికొనవచ్చును.

విదురుడు

(ప్రవేశించి) అజాతశత్రూ! యుధిష్ఠిరమహారాజా! జయము.

ధర్మరాజు

సకలతత్వనీతికోవిదా, విదురా !

మ॥ భగవంతుండు మహానుభావుడు మహాభాగుం దుపేంద్రుండు నె
నగ పీతాంబర ధారి సర్వజనసంమాన్యుండు శ్రీకృష్ణు డా
ఖగరాడ్వాహను డార్యసేవితుడు సత్కల్యాణసంధానుడున్
జగదీశుండు శుభప్రమోదయుతుడై సంతోషియై యొప్పునే?

విదురుడు

జగద్భద్రానుసంధాయి యగు సుభద్రానుజునకు సేమంబుగాక మ రెవ్వరి కగును? సకలయాదవవాహినీసమేతముగా క్షేమంకరుండై యుండెను.

సహదేవుడు

(తనలో) ఈ విదురుని పల్కులు వేరుగా ధ్వనించుచున్నవి. అయినను నడిగెదగాక! (ప్రకాశముగ) నీతివిశారదా, విదురా! యాదవవాహిని యందుగూడ నంతఃకలహములు గలిగెనని వింటిమి. ఇప్పు డెట్లుగా పరిణమించుచున్నవి?

ధర్మరాజు

అశ్వమేధాహూయమానపత్రము గాంచి వాసుదేవు డేమి ప్రత్యుత్తరం బిచ్చెను? భగవానుడు నీకు ప్రత్యేకముగా గలిసెనా?

విదురుడు

తామందరి శ్రీముఖముం గాంచిన విశదమగును. (లేఖ నివ్వ ధర్మజుడు బుచ్చుకొని)

ధర్మరాజు

కుమారా, వృషకేతూ! భగవద్వాక్యముల నీవు విపులముగా పఠించి మా కందరకు కర్ణానంద మొనరింపుము.

వృషకేతుడు

(అందుకొని చదువుచుండును. భీమార్జుననకులసహదేవమేఘవర్ణులు మధ్య మధ్య నందర్భోచితముగా మాటలాడుచుందురు.)

శ్రీమదిందిరానాథ చరణసేవానిరంతరానంద కందళితహృదయారవిందులును, శమదమాద్యనంతగుణపరిపూర్ణులును, సుప్రసిద్ధచంద్రవంశపావనులును, సమరసమయ సముజ్జృంభితజంభారిదోస్స్తంభసముత్తంభిత దంభోళిధారావిదారిత మహాభీలశైలాళి విశాలరవకోలాహలలీలాహళహాళికాసమారంభసుభగంభావుకగంభీరవిజయభేరీభయంకర భాంకారసంశరసముట్టంకితదిగ్వాటంకుందును——

అర్జునుడు

అస్మత్ప్రచండభుజాదండతాండవ మండలాగ్రఖండితారాతిమండల ల్వ మా మొండిబండ పుండరీకాక్షుండు మాత్రమెఱుంగఁడా ?

ధర్మరాజు

అర్జునా ! యెందుకీ యనవసరప్రసంగము! కుమారా! చదువుము.

వృషకేతుడు

విశేషించి భీమార్జున బాహావిక్రమోపార్జితరాజ్యరమావిభవసంపన్నులును నగు

సహదేవుడు

ఇందలి యసూయాభావము తమకే గోచరము కావలయును ?

భీమసేనుడు

ఇందసూయ యేమున్నది ? నిశ్చయమునే లిఖంచెను. అతనికి మాత్రము తెలియదా ?

ధర్మరాజు

తరువాత పఠింపుము.

వృ ష కే తు డు

శ్రీమదింద్రప్రస్థపురసింహాసనాసీనుల రగు శ్రీ శ్రీ శ్రీమ న్మహా యుధిష్ఠిర సార్వభౌమపదరాజీవముల సన్నిధికి— ద్వారవతీనివాసుండగు వాసుదేవుండు కృతానేకనమస్కారపురస్సరంబుగ లిఖించుకొను లేఖాంశములు.

అ ర్జు ను డు

అంతవరకు సరియే. తరువాత సెలవిండింపుము.

వృ ష కే తు డు

తాము వ్రాయించిన యశ్వమేధాహ్వానపత్రిక సకలతత్వనీతికోవిదుం డగు విదురమహాశయునివలన గాంచి యపరిమితానంద హృదయారవిందులమైతిమి.

న కు లు డు

ఇందును వ్యంగ్యధ్వని గోచరించుచున్నది.

ధ ర్మ రా జు

మీ రన్యాలోచనావిదు లగుటంజేసి య ట్లనిపించుచున్నదిగాని ఇందు వ్యంగోక్తి యెంతమాత్రమును లేదు.

మే ఘ వ ర్ణు డు

ఉండినను అందువలన నగున దే మున్నది?

ధ ర్మ రా జు

మీరు మాటలాడక సాంతముగా చదువనిండు.

స హ దే వు డు

ఇంక సంపూర్ణముగాఁ బఠించున దేమి? అందలి భావము తేట తెల్లముగాఁ దెలియుచునే యుండెను. విదురా! అంతియే గదా!

విదురుడు

అవును, సందేహ మెంతమాత్రమును లేదు.

ధర్మరాజు

సాంతముగా వినక మధ్యమధ్య నీ యధిక ప్రసంగములతో పనేమి?

భీమసేనుడు

అవును అగ్రజా! మాపలుకు లెప్పుడునూ యధికప్రసంగము లే?

ధర్మరాజు

కుమారా! తరువాత చదువుము.

వృషకేతుడు

అందలి విషయంబులకు సంతసించితిమి. గాని తమంతటివా రొనర్చు యశ్వమేధమహాధ్వరము నిర్వహింపగలంత సమర్థత్వము మాయం దెంతమాత్రంబును లేదు. అది మీకు మాయందుగల అవ్యాజానురాగాతిశయంబున నట్లూహించితిరిగాని, యాదవు లందు కెందునూ దీటురారు?

సహదేవుడు

అగ్రజా! యేల నింక చదివించెదరు? భావజ్ఞులైన మీకు వారి తత్వ మింకను బోధపడ లేదా?

ధర్మరాజు

సోదరా! యే మట్లు త్వరపడియెదవు? సాంతము గానిమ్ము.

వృషకేతుడు

సకలబలశాలులును, తిరస్కృతానేకశాత్రవులును, కాలకేయ కిమ్మీరదానవమదగర్వాపహారులును, మహావిక్రమసంపన్నులును నైన మీ ప్రియసహోదరు లగు భీమార్జునుల యవక్రపరాక్రమవిక్రమంబున సకలంబును సత్కృతంబు గాఁ గలదు.

భీమసేనుడు

కాకపోయిన మునుపుమాత్రము నీవలనమాత్రము గానున్న దేమి? ఏమో, మాధర్మజుని సద్ధర్మప్రతిష్ఠాగరిష్ఠత్వము మమ్ముల నేమి జేయింపదు? అయినను కా దన్నవారికి లేఖ నేమలకుఁ బంపవలెను?

ధర్మరాజు

భీమసేనా! ఎందు కా యనుచితసంభాషణము! ఎన్నితూర్లు జెప్పినను మీరు వినరుగదా! అహా! యెంతవర కని భరింపవలయును? తరువాత—

వృషకేతుడు

మేము ప్రస్తుతము కరిపురంబునకు వచ్చుట కెంతమాత్రమును వీలుపడమి చింతిల్లుచున్నారము. ఇందులకుఁ దాము మరియొకతీరున భావింపకుందురుగాక యని కోరుచున్నాము. కారణ మే—(అని యింకను చదువబోవుచుండఁగా నొకసేవకుఁడు గారడీల సంగతి నెఱింగించును)

ద్వారపాలకుడు

మహాప్రభో! ఇరువురు గారడీవాండ్రు హాజారముకడ నుండిరి. ప్రభువువారియాజ్ఞ.

భీమార్జునులు

సత్వరము లోనికిఁ బ్రవేశపెట్టుము. (గారడీలవేషమున శ్రీకృష్ణనారదులు ప్రవేశింతురు.)

శ్రీకృష్ణనారదులు

పంచచామరము.

పరాజితారి ధీరవీర•పాండవాగ్రణీ ధరా
వరాళిలోన మిమ్ము మించు•వారు లేరటంచు మా
వరాలు జూపు గారడీల•వాండ్లమయ్య! సుంతయుఁ
పరాకులేక మాదు ప్రజ్ఞ•పాలసంబు జేయుడీ.

ధర్మరాజు

మంచిది. మీర లే యే రాష్ట్రపతుల వీక్షించితిరి ?

శ్రీకృష్ణుడు

సీ॥ అంగ వంగ కళింగ • బంగాళ నేపాళ
కాంభోజ సౌవీర • కామరూప
మహారాష్ట్ర మాగధ • మాళవ పాంచాల
కురు కొంక కొంకణ • ఘూర్జరంబు
సింహళ గాంధార • సింధు కోసల నాట
ద్రవిళ ద్రావిళ శూర్పంధర కిరాత
కాశ్మీర కర్ణాట • కల్హాట సౌరాష్ట్ర
కేరళ యవ నాంధ్ర • శూరసేన
తే॥ గీ॥ చోళ మళయాళ మద్రవ • గౌళ వత్స
బాహ్లీక విదర్భ కేకయ • పాళ భోజ
అల దశార్ణవ మహానాఢ్య • సైంధవంబు
బర్బర పులింధ్ర వైదేహ • మత్స్య కుంతి
నా వరాశేరసీమల • నరసి తయ్య !

ఆ యా రాష్ట్రపతుల గని యనేక బహుమానంబుల నందితిమి. వే యేల, మేము చూడని దేశమే లేదు; మేము తిరుగనిరాజ్యమే లేదు.

అర్జునుడు

ఏ యే దేశాధీశుల యాస్థానంబుల యే మేమి వింత లొనర్చిరో యథార్థం బెఱుంగింపుడు.

శ్రీకృష్ణుడు

మా గారడీమహిమ మే మే మని కొనియాడఁగలము ? సకల లోకంబులయందును మా గారడియే సాగుచుండును. మా గారడీ లేని ప్రదేశమే లేదు.

సహదేవుడు

ఈ ప్రగల్భవాక్యముల కేమిగాని, మీ విద్యను బ్రకటించుడు.

నారదుడు

మత్తకోకిల

ఏరు సేయఁగలేని విద్యల • నెంతయు న్మదమొందఁగా
కోరినట్టులఁ జేయఁగల మో • కోవిదాగ్రణివంద్య! శృం
గార మగు నొకహాయము ముచ్చట • గాఁగ జేతుము జూడఁగన్
ధీరు లున్నను నెక్కుఁడీ, లేఁదేని జేతుము నాఠిగన్.

సహదేవుడు

ఉ॥ నోటికి వచ్చినట్లెటుల నూరక • ప్రేలుచుఁ బల్కనేల? యీ
మాటలఁ గట్టిపెట్టు; యభిమానము వీడ్వన మోగ్రిఁగఁబోకు, నీ
బూటకవృత్తి దుండగవు • పోకలు మానుము, నొక్కకానుకున్
దీటెటురావు పోల్ప రణ • ధీరులముందర నింక గాఁడీ!

అర్జునుడు

సహోదరా! సహదేవా!

తే॥ గీ॥ ఉర్విఁగల గర్వబోతుల • నుక్కడంచి
శిష్టజనరక్షణము దుష్ట • శిక్షణంబు
గలిగి మెలగెడి మనకు సం • కల్పిఁగో హాయము
నెక్క నొక లెక్కయే? తెమ్ము • నిక్కవముగ.

ధర్మరాజు

సోదరా, పార్థా! తొందరపడకు మాగు, మాగుము.

శ్రీకృష్ణుడు

మత్తకోకిల

భీమసేనా! మహాబలా! విను • భీమమౌ నురగంబు మే
మేమరకఁ జేసెదము నిప్పుడు • వీరుఁడవు నీవైనచో
నీ మహోరగ మెత్తి పౌరుష • మీవు జూపుము నీక్షణం
బీ మహాసభవారు మెచ్చఁగ • నింపుసొంపు దలిర్పఁగన్.

భీమసేనుడు

మ॥ పగసంఘంబుల కందుకంబులక్రియన్ • నాడింపఁగాఁజాలి ము
జ్జగము ల్మెచ్చఁగఁ గీర్తిఁగాంచె నిట మీ • జంఝాటముల్ సాగునే?

గారడీలు

అయ్యా, అయ్యా!

భీమసేనుడు

మగుడం బల్కకు నోరుమూయు మిక ని • న్మానుష్యముల్ గాదు ఛీ!
పగరా ధీరులు విన్న నీపలుకు లు • న్మాదక్రియల్ గారడీ!

(పాము నెత్తఁబోఁగా నది కరువ కరువలినూనుఁడు పడిపోవుచుండును. అది జూచుచునే యర్జునుఁడు హయముపై నెక్కి రివ్వున పైకి బోవును. నారదుఁడు డక్కావాయించుచు తాళానుగుణ్యముగా నృత్యముజేయుచుండును కృష్ణుఁడు పాటఁబాడుచుండఁగా అందరును సమ్మోహములోఁబడి అచేతనముగా నుండ యిరువురు గారడీలు పాటబాడుచు ఆటలాడుచు నిష్క్రమింతురు.)

గారడీలపాట — రూపకతాళము — బిల్హరిరాగము.

జగములగారడి । జేయుచునుందుము
పగతుల గర్వము । ఖండించెదము॥ జ॥

అండపిండ బ్ర । హ్మాండభాండముల
దండిగ బంతుల । తరగతి ద్రిప్పెదము॥ జ॥

తెలియని మాయల । దెల్పుచు నుండఁగ
తెలియకమాయల । తెరవున బడెదరు॥ జ॥

వేదశాస్త్రము ల। వెన్ని జదివినను
మాదగు గారడి । మహిమ దెలియరు॥ జ॥

### ధర్మరాజు

(చింతాక్రాంతుఁడై) గారడీలమాయయా లేక నిజమా! ఈ పడిపోయిన పడముడిసూనుఁడు లేచునా? అర్జునుఁ డేమయ్యెను? నా శరీరమంతయు గడగడ వణఁకుచున్న దేల? నా కింద తంద రేల? నా కీ యారాట మేమి? ఈ దాహ మేమి? నా కాయ మంతయు జెమటలు గ్రమ్ముచున్న వే? నోట తడియారుచున్న దే! ఏమి యీవిపరీతము!

### శ్రీకృష్ణుడు

చ॥ కమలభవాండభాండముల • కందుకవర్గము ద్రిప్పునట్లు నే
క్రమముగ సర్వలోకముల • కార్యరతిన్ వడి ద్రిప్పుచుండ ; నీ
విమతులఁ గల్పనావిధిని • వీలుగ ద్రిప్పఁగలేన; యింక నీ
కుమతుల గర్వవృత్తులను • గూల్పకపోయిన నేను చక్రినే!

(గారడీలు నిష్క్రమింతురు. నకులసహదేవమేఘవర్ణ వృషకేతులు భీము నొకతల్పముపైఁ జేర్చుదురు. ధర్మరాజు భీమునొద్దకుఁ బోవుచుండ నందరు ననుసరింతురు. తెర నెమ్మదిగా జారును.)

---

## తృతీయరంగము

ప్రభాతసమయము - సముద్రమధ్యద్వీపము.

(తీరసమీపములో పెద్దవటవృక్షము - అర్జునుఁడు తడిబట్టల పిండుకొనుచుఁ బ్రవేశించును.)

### అర్జునుడు

అకటకటా! ఈ మాయాతురంగ మంతరిక్షమునుండి బిళ్ళబీటుగా నన్నీ మహార్ణవమధ్యమునఁ బడవైచి యెటకుఁ బోయెనో గదా! నా ప్రాణము లింక నీబొందెలో నిలుచుయోగ ముండబట్టియే యేపర్వతమునందునో బడద్రోయక యీ సముద్రమున విడిచినది. దైవవశమున యీలంకయే యిట లేకపోయిన దరిలేని యీయంబుధి తరింప నా తరమగునా? చండభానుని ప్రచండతీక్ష్ణకిరణపుంజములకును, యీ నీరాగార మింతదనుక నీదినందులకును నా సర్వాంగముశ్రమనొందుటయే

గాక నాకలిబాధ మిక్కుటమగుచున్నది. ఈ క్షారోదకపానమున కక్కు కక్కు నాపేగులు పెల్లగిల్లుచున్నవి. ఏమి జేయుదును? స్నానముజేయుటవలన ఆకలిశమించునుగాని, యధికమగునా? ఇంతఫలాహారము జేయుటకైనను నీ వటతరువుదప్ప నితర ఫలవృక్షము లేవియు గన్పడుటలేదు. ఇన్ని చిత్రవిచిత్రతరులతాదిభూరుహంబుల బెంచినవార లేల ఫలతరువుల బెంచకుండిరో, పారిద్రెక్కునకోలదియు నా క్షుద్బాధ మిక్కుటమగుచున్నది. ఎక్కడి యింద్రప్రస్థపురము; యెక్కడి జలనిధిమధ్యద్వీపము. అయ్యో! ఆ గాండీవ పౌరుషవాక్యములను బాటించినందులకుగదా, నా కింతదారుణకష్టము సంభవించినది! నేను వాయువుపై బయలుదేరునప్పుడు సర్వముం జేసి బలశాలి నైన భీమసేనా! నీ వెత్తుమని పౌరుషము బుట్టింప మా వాయుజుం డానదీప్రవము నెత్తి క్రిందం బడంబోవుచుండెను. ఆదర్పోకరము మత్సహోదరుం డగు వృకోదరు నేమి జేసెనోగదా! ధర్మరాజాదిసోదరుల నాగారడీ లే మొనర్చిరో? ఈ సాగరమధ్యంబున నుండి నేను తప్పించుకొనిపోవు నుపాయ మే మున్నది? అబ్బా! నిలువంజాలను. నిలువంజాలకున్నాను వస్త్రముల బిండుటకైనను నా హస్తములయం దోపిక లేక వాడిన తోటకూరకాడలవలెనున్నవి. నిన్నమధ్యాహ్నము బయలుదేరిన హాయ మంతరిక్షమున మనోవేగముతో బరువిడి యిప్పటి కెంతదూరము నడచినదో? అంధకారబంధుర మగు యాకాశమున నుండి నేను గుర్తింపలేక యేదిశ యేదో నిర్ణయింపలేక కర్తవ్యతామూఢుండనై తినిగదా! ఆహా! వణకు, శోషకూడ బొడముచున్నవే. ఈ వస్త్రముల నారవేయుటకైన యీ పుష్పలతానికుంజములు చెడిపోవునేమో యని నాకు జాలిగొలుపుచున్నది. పోనీ యీతీరముననే యారవైచెదను. ఈ వస్త్రము లెప్పటి కారునోగదా! (ఆరవైచి యటు నిటు జూచుచు)

ఉ॥ ఎక్కడిగారడీలు, మఱి ♦ యెక్కడి దీ హాయ ముత్తంబు, నే
నెక్కడ, నిర్మనుష్య మగు ♦ నీరధిమధ్యను లంకయేడ, యే
దిక్కుననుండి వచ్చితినొ ♦ దెల్పకనుండెను నాకు నక్కటా!
దక్కునొ పూర్వవైభవము ♦ దక్కదొ యే దెటు గాగ నున్నదో!

ఆహా! గారడీ లెంతమంత్రతంత్రవేత్తలు! కాల మనుకూలము గానియప్పుడు మనుజునివిద్య లెందులకును కొరగావుగదా! నరసంచారములేని యీ యంబుధిమధ్యంబున నే నేమి చేయుదును? అయ్యో! యేమి యుపాయము పాలుబోకున్నదే! (దూరమున పరికించి) మానిసి యలికిడిలేని యీరత్నాకరమధ్యద్వీపంబునకీ కాంత యేకాంతంబుగా యెక్కడనుండి వచ్చినది? ఇంత చింతాంబుధిలో మునింగియున్నను, నా మన మేలనో యీ నాతిపైకిం బోవుచున్నది. ఏ మా జగన్మోహనలావణ్యము? ఇంతవరకుం గని విని యుండలేదే! ఫలహారంపు పళ్ళెర మేరి కొరకిటు దెచ్చుచున్నది? నాకొరకే యైయుండునా? అయిన ధన్యుడనై బ్రతికిపోదును క్షుధార్తుండనై కడు బడలియున్న నా కాకాంత ఫలహారంపు పళ్ళెరము నొసంగి నాయాకలి దీర్చునా? ఆహా! యేమి నా మతిచాంచల్యము? నడువేసంగిని యెడారిమధ్యమున పాంథుండు నీరమే యమృతముగాం గోరుచందమున నీ ద్వీపమధ్యమున యాకలిబా—

(అనుచుండంగనే మోహిని యొయ్యారముగా చటుక్కున ప్రవేశించి)

మో హి ని

ఆకలిబాధభరింపలేని యోపాంథా! చింతిలకుము. ఇవిగో తీయని ఫలములు. ఆకలిదీరునట్లు భక్షింపుము. (అని యిచ్చి) ఎవ్వరు నీవు? ఈ నీరాగారమధ్యమున కెట్లరుదెంచితివి?

అ ర్జు ను డు

(తనలో) ధూమజాలనిబద్ధ మగు నగ్నిప్రభవలె, నీలాభ్రము మరువున నున్న పూర్ణచంద్రునివలె యీనిర్జనప్రదేశంబునకీ కలికి యెక్కడిది? (ప్రకాశముగ) ఇంద్రప్రస్థపురం బేలు ధర్మజసోదరుండను, అర్జునుం డనువాండ. చూడ వేడుకమై యిట కరుదెంచితిని.

మో హి ని

(ఆలోచించుచు ఆగి ఆగి) రాజలాంఛనములైన నీదుస్తులు తడిసిపోవుటకు కారణం బేమి? తడిపుట్టంబులతో నిట నుండ నేల? ఒక్కరుండవే యరుదెంచితివా?

అ ర్జు ను డు

సముద్రోదకంబున స్నానం బొనరించితిని. అందువలన......

మో హి ని

అన్యవస్త్రంబులపై గాక యీ దుకూలంబులపై నేల జేయవలయును?

అ ర్జు ను డు

అవసరము లేదనుకొని పరియాణమై వచ్చుటవలన?

మో హి ని

అటులనా! పాపము? కడు బడలియుంటివి. ఫలహారము లారగించి మీ పథికాయాసమును దీర్చుకొనుడు. (అని ఫలహారము లందించును)

అ ర్జు ను డు

(ఫలహారము లందుకొనుచు తనలో) ఈపై వాక్యముల యందు మేఘగంభీరగర్జనంబులును నేత్రములందు విద్యుచ్ఛక్తివిలాసమును, అంగవైఖరి యందు విలాసవిజృంభణంబును ద్యోతకములగుచున్నవి. ఈ యువిద యొకపరి గౌరవముగను, మరియొకపరి నీచముగను, యింకొకతరి చనువుగను నుచ్చరించుచు బోధించుచున్నది. ఈ తరుణి యెవ్వరై యుండునో గదా! (ప్రకాశముగ) లావణ్యవతీ! నీ పరోపకారపారీణత్వమునకును, నీపరేంగితత్వమునకును, నీ దయాహృదయమునకును కడుంగడు సంతసించితిని. మిక్కిలి ధన్యుడనైతిని. నీ వెవ్వరిదానవు? నీపేరేమి? ఏకాంతముగా నిట నుండుటకు గతం బేమి? (ఫలహారములం దినుచు)

తే॥ గీ॥ ఆపదంబుధిమధ్యంబు•నందు నున్న
నన్ను ధన్యుని జేయ గ•నంగ వచ్చి
ఫలముల నొనంగి యాకలి • బాపి తీవు
మానినీ! దైవవిధిని నే • మనగ వచ్చు.

### మోహిని

కిరీటీ! ఫలహారములను జేయుచుందుము. ఒక్క క్షణికలో పొడి వస్త్రంబుల గొనివత్తును. (అని విలాసముగా చెట్లలోనికిఁ బోవును)

### అర్జునుడు

ఈ కలకంఠకంఠికంఠధ్వని మున్నెచ్చటనో వినినట్లు నాకు స్ఫురణకు వచ్చుచున్నది. కాని యెచ్చటనో జ్ఞప్తికి వచ్చుట లేదు. అదియేమో గాని యీకాంచనాంగి కలస్వనంబులో మధురధ్వనియు భీషణధ్వానమును శ్రవణగోచర మగుచున్నవి. నిక్కముగా మనుజభామినియే యైయుండునా, లేక దివిజాంగనయా? నే నేదియు నిర్ణయింపజాలకుంటినే? ఈ సంఘటన మంతయు నాకు కడుంగడు నద్భుతముగా నున్నది. కా ... ని ...! ఇట్టి దుర్భరదురంతదుస్సహకష్టపరంపరలలోఁగూడ మదీయమనోభ్రమరం బేలనో కామితాంబుధిని మునింగి యాజగన్మోహినీముఖాంబుజంబుపై వ్రాలు నుంకించుచున్నది? ఆహా! నే నెంత మతివిహీనుండను? వచ్చిన కష్టంబు దప్పించుకొను నుపాయం బన్వేషించుటకు మారుగా నే నీ మోహనాంగి మోహమును బొంద నభిలషించుచుంటిని. నన్ను నే నే మనుకొనవలయును? ఈసుఖదుఃఖమిశ్రమ ప్రారబ్ధంబులు న న్ననుభవింపజేయుటకై యుండును. ఈ కష్టపుంజంబులను బొందనేరని నాకు కామ్యప్రచారంబు లేల? అయినను నే నిప్పుడింత అయోమయుండనైతి నేల? అనుకొన్న భావ మొక్కటిగాని స్థిరముగా నిల్చుట లేదు. ఇంకేమైన మతిభ్రమణము గలిగినదా? నే నేమి మాటలాడితినో, ఇప్పుడేమి మాటలాడుచుంటినో నా కేమియు తెలియుటలేదు. ఆగారడీ లేమైన మచ్చుజల్లియుందురా? సముద్రోదకస్నాతుండనైన పిదప, మనోవికారమంతయు సడలిపోవలయును. పోయినచో మదీయహృదయంబునకు నిష్కామ్యవిచారంబుల సౌర గొనగలదు. ఆహా! మోహ మెంత సామర్థ్యము గలది?

చ॥ నరస మొకింత నుండ జనంజాలదు, యాప్తుల ద్రోయు, నుంతయుఁ
    బరువు నెఱుంగనీయక యంభా సొనరించును, సర్వబంధులన్

గురుతు రవంతయేని గొనంగోరదు, శాంతము దీయు, కష్టముల్
విరివిగ జేయు, మోహా మన • నెంతటి శక్తిమయుంబొ యుద్ధరన్ !

(మోహిని తనదుస్తులను మార్చి అర్జునునకు నూతనదుస్తులతో ప్రవేశించును.)

మో హి ని

విజయా! యేమిా భుజింపక యాలోచింపుచుంటివి? ఫలంబులు రుచ్యంబులుగా లేవా?

అ ర్జు ను డు

ఆహా! రుచియా, యేమి మాధుర్యము? అమృతరసంబునకేని లభింపరాని మాధుర్యము! రుచి యనియా ప్రశ్నింపుచుంటివి? కాని మానినీ! నీ నామధేయము?

మో హి ని

మోహిని, గాని—తడి వుటంబులు విసర్జించి ఈ దివ్యదుకూలంబులు ధరియింపుము. తరువాత భుజింపవచ్చును. (కరము కరమున గీలించి లేవదీయుచు పాట బాడుచుండును. తత్తదుచితముగ అర్జునుడు తూలుచు సోలుచు వస్త్రంబుల గట్టుచుండును.)

మలయమారుత రాగము—ఏకతాళము.

మలయమారుతము । చెలగుచు విసరగ
కలికివలవు । తెలియక ఫలమా॥ మ॥

అళితతి మధురా । విలసిత వనరుత
కళగానము పరి । మళసుమరంజము॥ మ॥

శుకపికశారిక । సుందరగీతా
చకచక సొంపులు । వికసితహృదయము॥ మ॥

సురభోగమునం । దరవిరిపాన్పున
పరిమళమాలను । పా మన దగునా॥ మ॥

(అని అనేకవిధములుగా లాలింపులు, సరసములు జేయుచుండును.)

అర్జునుడు

త్రిభువనైకమోహినీ, మోహినీ! నీవృత్తాంతము దెల్పితివి గావు. నీవొంటరిగా నుండుటకు గతం బేమి? దయ గని దెల్పుము.

మోహినీ

రూపనిర్జితజయంతా, విజయా! (ఆలోచించి తరువాత వచించె దను. శ్రమవాయునంతదనుక కొంచెమునే పిట విశ్రమింపుము. (అని తనయూరువు జూపును.)

అర్జునుడు

(ఫలహారముల ముగించి పరవశుండై మోహిని తనను దగ్గరకుఁ దీసికొనుచుండఁగా దననుసారముగా గూర్చుని జరుగుచు యూరువు పై శిరముంచి పరుండి యామెవదనమును దిలకించుచుండును. మోహిని తనకరకమలములతో అర్జునుని కపోలముల నప్పుడప్పుడు పుణుకు చుండును)

మోహిని

విజయా! యింతదూరము ఈ సముద్రమధ్యమున కెట్లరుదెంచితివి? నిశ్చయము దెల్పుము.

అర్జునుడు

రమణీలలామా! నిజము దేవు డెరుగును. నేను యేది తెల్పినను నీ కిదమిత్థమని యెట్లు తెలియును. అయినను వినుము. ఒక్క దివ్య శిల్పినిర్మితవిమానంబున యమరపురి కరుగుచుండ నది దైవవశంబున పడలి యీనడిసముద్రంబున బడి నీసందర్శనప్రాప్తివలన యిప్పటికి నేద దేరితిని. ఇదియే నా యథార్థమైన వృత్తాంతము. తరువాత నీ వేమైనను ననుకొనుము. నోరుజారి యనృతము వచించినందుకు నన్ను మన్నింపుము.

మో హి ని

సరియే, మన్నించితిని. విమానంబుపై త్రివిష్టపంబున కరుగదలచినవాడవు, కురురాజ్యమున కుత్తరముగా బోవలయునే— యిన్ని యోజనముల దూరమున నున్న యీదక్షిణాంబుధిలో నేలబడితి వని సందేహించుచున్నాను. నా సందేహమును దీర్చెదవా?

అ ర్జు నుడు

(తనలో) ఈకాంత దివిజనారీమణి గాని, మానవమానినీమణి గాదు. ఈధ్వనిరూక్ష మేమో గాని, నా కే మేమో దోచుచున్నది. ఇప్పటి కే రెండుసార్ల సత్యము వచించితిని. నన్ను నమ్మకుండెను. నమ్మకపోయిన నే నేమి గావలయును? నరే కానిమ్ము. (ప్రకాశముగ) మోహినీ! యేల యింత విమర్శనము? నమ్మవా, నన్ను?

ఉ॥ దక్కనుభూమి నంతను ప్రదక్షిణము న్నొనరించి పశ్చిమం
బెక్కి త్రివిష్టపంబునకు వేడుకమై చన గోరి నిన్న యీ
పక్కకు రాగ నిట్టి ప్రతిబంధక మయ్యెను గాని, లేనిచో
నిక్కడ చిక్కు లందుదునె నీరజపత్రవిశాలలోచనా!

మో హి ని

(తనలో) ఈ మానవుడు నాయిడిన మస్తుఫలంబు లారగించి వ్యత్యస్తహృదయుడై తారుమారుప్రలాపంబు లాడుచుండెను. అదియునుగాక నన్నుజూచినతోడనే విపదంబుధిలో బాటు మోహాంబుధిలో మునిగియున్నవాడు. మరి దిగక మునుపే వీని నావశమున నిలుకొనవలయును. (ప్రకాశముగ) పాపము! ఎంత యాసితివి? సుందరసుకుమారములైన నీయంగము లెంత కందినవి? ధార్తరాష్ట్రనిర్మితవ్యూహభేదనసవ్యసాచి వగు నీకు యీసాగర మీదుట బహుకష్ట మాయెనుగదా!

అ ర్జు న ుడు

(కూర్చొనబోవుచు మోహినికరములు మృదువుగా నిమురుచు) భవదీయ సుందరసుకుమారముఖారవిందసందర్శనమే నాకు లేకపోయిన నే నీవర కే మై యుందునో?

మో హి ని

(ముఖముపై ముఖ ముంచి నవ్వుచు) యిప్పటికైన నీబడలిక దీరినదా? శాంతుఁడవై నంతనమున నుంటివిగదా! భయము దీరినదా?

అ ర్జు ను డు

బడలికయా, లేదుగాని భయముమాత్రి మున్నది?

మో హి ని

ఏ మా భయము? నీవు భయపడుట కిక్కడే మున్నది?

సీ॥ శ్రమ వాయఁజేయు నీ • చల్లని పవనాంకు
రంబులు నీ కను•ర క్తి లేవొ?
వెస మారుతోద్ధూత • వికిపరాగామోద
పూఁజముల్ హిత మంత • బోల్పలేవొ?
లలి తరంగంబుల • మెలఁగెడి రాయంచ
గమనవింతలు మది • గలయలేవొ?
గంభీరనిస్వనుల్ • కడలి బాడెడు మంజు
లాలాపగీతాళి • దెలియలేవొ?
తే॥ గీ॥ లలితపల్లవకుసుమవి•లాననరస
నంతతామోదభరితవ•నంతకీర
శారికాకేకిపికగాన•సంకులంబు
గాంచి యీ లీల భయమంద•గా ని కేల?

విజయా! యింకనూ నందేహింప నేల? ఇది భయపడవలసిన స్థలమా? భయ మందుటకు దగినసమయమా? ఆహా! యేమి నీ న-ర న-త్వ-ము! అవునులే, మిక్కుటముగాఁ బ్రేమయున్నచోట భయము కూడ నుండు ననిమ...మ...అందురు.

అ ర్జు ను డు

భీతియా, అంతగా లేదు గాని, నాన్వజను లె ట్లుండిరో యను చింతమాత్రి మున్నది? అదియును నీ యాదరాతిథ్యమున నిప్పుడు లేదు గాని——

మోహిని

పార్థా! నేను...నీ...స్వజనమును గాఁగూడదా?

అర్జునుడు

మోహినీ! నిశ్చయమా? ఆహా! యేమి నాభాగ్యము? నేను నిశ్చయముగా ధన్యుడను. విపత్కాలమున నాపదంబుధిని జిక్కిన నాకు నిక్కమైన మక్కువ దీర్చగల చక్కదనాల రిక్క వగు నీవు నా కండదండవై నిలువ నే నింక యాసింపదగిన దే మున్నది? సకలరాజ్యోద్యుత్తమభోగంబులును కామినీకామోపభోగసుఖపారవశ్యాంబుధివీచీపరంపరల దేలియాడుట కేగదా! నా భావికాలభాగ్యోదయమంతయు నీ హృదయపంజరమం దున్నది. న న్నెట్లుగా నుపయోగించుకొనినను నీ యిష్టము; నీదయ. ఒక్కడను నీచేత జిక్కితిని. న న్నేమిచేసినను నీదే భారము. నాహృదయ మేమో నీయందు లగ్నమై విడిపోరాకున్నది. నన్ను పాలింపుము. సౌఖ్యముల దేలింపుము? ఏదియైనను నీదే.

మోహిని

అర్జునా! యేల యీలీల బేలవై యాలసింపుచు సందేహించెదవు?

సీ॥ ధనవంతునింట బుట్టిన సుభద్రవిధాన
తప్పుదెప్పుల నిన్ను • దలఁతు ననియొ
ద్రుపదరాజతనూజ • ద్రౌపదిరీతిగా
గురుకష్టముల కోనఁగూర్తు ననియొ
అల యులూచివలె • సక్కఁగదీరఁగ
రసికత జూపని • రమణి ననియొ
ప్రేమలాపప్రమదకాంతె • భాగ్యభోగ్యములందు
సరిదూగ లేనట్టి • సఖియ ననియొ
తే॥ గీ॥ స్వీయవనితగ నన్ను వరించి సకల
ప్రవిమలానందసుఖముల • బడయు మన్న
యేల యాలోచ సింక నీవేళ విజయ!
నేను నాయంత వచ్చుట • నేర మరయ.

అర్జునుడు

యువతీశిరోరత్నమా! అట్లని నాయభిప్రాయము గాదు. నిశ్చయముగా నీ వట్లు భావించితివేని యిప్పుడే గాంధర్వంబున నిన్ను స్వీకరించెదను. నీ కంగీకారమేనా? అదియును గాక నా సందేహంబున కింకొక్కకారణంబు గూడ గలదు; ఈ సముద్రమధ్యంబున నీ చిన్నవనంబున నీ వొంటిగాలియం దెట్లుండగలమా యని!

మోహిని

(ఆలోచనగా తల పంకించి తనలో) ఈతడు న న్ననుమానించుచునే యుండెను. ఇంత మైకములో నున్నను, వికలము లేదేమి చెప్పుమా? ఇంక కొంతదనుక ప్రయత్నించెదను. (ప్రకాశముగ) మరొక్క సందేహం బున్నదంటివే, అది యేమి? నీ సందేహంబున కదే కారణంబు గనుము. (అర్జునుని భుజముపై చేయి వైచి రెండవ చేతితో నొకమూలకు జూపును.)

అర్జునుడు

ఆహా! అత్యద్భుతము. నవరత్నసోపానమండితంబును, సుందరమణిస్తంభసంభావితంబును కనకమణిగణప్రభావిభాసితం బగు నీ సౌధము నే నింతవరకు వీక్షింపనే లేదే. కాంతా! యీ కాంతారంబున యీ శుద్ధాంతసౌధాంతరంబున నీ వేకాంతిముగా నె ట్లుండ గలుగుచుంటివి?

మోహిని

దాని కేమిగాని, నీ సందేహంబును దెల్పవైతివి.

అర్జునుడు

తే॥ గీ॥ తీర్థయాత్రావినోదినై • తిరుగు నపుడు
అమరపురి కేగ యూర్వశి • యాదరమున
రతివిధానంబు నన్ను గోరంగ నేను
వినకనైతివి నన్ను శపించె మిగుల.

మో హి ని

ఎందుకు నిరాకరించితివి? యేమని శపించెను? (క్రొంతభావప్రకటన నభినయించవలెను)

అ ర్జు ను డు

మాట లాడుచుండగనే ప్రశ్నించిన, సంభాషణ మెట్లు సాగును? అప్పుడు నన్ను 'పేడివై నారీజనమధ్యంబున నాడుదానివలె నొక్క వత్సరంబు చరింతువు గాక' యని—

మో హి ని

నరాంశసంభూతుండవు, మర్త్యలోకవాసివి, ఉత్తమక్షత్రియుండవు, విజయనామాభిధానుండవు, అప్పటిలో యువకుడవు, అడుది శాప మిచ్చినంత మాత్రంబున నిర్వీర్యుడవై మాటలాడ జాలక యూరకొంటివా?

అ ర్జు ను డు

సుక్షత్రియవీరరుధిరము నాశరీరమున ప్రవహించుచుండ నేను మాత్ర మూరకొందునా? అట్లు శపించిన యూర్వశిం జూచి 'ఓసీ! నన్ను నిష్కారణముగా శపించితివి కనుక నీవు రాక్షసాంగనవై భూలోకంబున నిర్జనప్రదేశంబున నొక్క నరుని చెట్టబట్టి పలువురబిడ్డలం గాంచుదువు గాక' యని కసిదీర శాపం బిచ్చితిని.

మో హి ని

(ఆలోచించి) పార్థా! మాం...చి...పని జేసితివి? అప్పుడకామిని యేమొనర్చెను?

అ ర్జు ను డు

అప్పు డా నిర్భాగ్యురాలు 'పార్థా! నేను నీకిచ్చిన శాపము మేలే యొనర్చుగాక' యని 'తనశాపంబునకు ప్రతిశాంతభిక్ష నిడు'మని నను దైన్యమున బ్రార్థింప, నాకు జాలిగలిగి ప్రశాంతుండనై 'యువిదా! నీవు రాక్షసివై యున్నప్పుడు ని న్నెవడు వియత్తలమున కెగురవైచునో యప్పుడే నీవు తొంటిరూపంబు బొందుదు'వని వచించితిని.

మో హి ని

(భయము నటించి) విజయా! నన్ను గూడ నట్లు జేయుదు వేమో గదా! అదియును గాక నన్ను భార్యగా స్వీకరించెద ననుచుంటివి. భూలోకమందలి జంబూద్వీపవాసులు స్త్రీలను, అందున భార్యలను బానిసలగా జూచెదరు. దాసీలవిధంబున సకలయూడిగంబులను జేయించు కొనెదరు. అవసరము గానిచో విసర్జించుటయు, పశువులగా విక్రయించు టయు మొదలగు నీచకృత్యములను జేయుదురు. నీవును భరతఖండ వాసుడవుగాన నన్నును చేపట్టి నీయిచ్ఛవచ్చినట్లుగా చేత సరికించుకొని నీదేశాచారమునకు నన్ను పాల్పరుతువా యేమి? అట్లయిన నేను దెల్పు విషయంబులను సంపూర్ణముగా వినవలయును. ఆచరింపవలయును. మరచితి ఇందు నీసందేహ మేమి?

అ ర్జు ను డు

(స్వగతము) యేమీ? యింతదనుక మృదుమధురముగా సంభా షించి యిప్పు డింత గంభీరధ్వనితోఁ బల్కుచున్న దేమి? కామరూపిణి యగు రాక్షసాంగన గాదుగదా! అయిన అది యేమో వినెదను. (ప్రకా) మోహినీ! యేదియో వచింపుము (దీనముగా) రోటిలో తలదూర్చి రోకటిపోటునకు వెరవదీరునా?

మో హి ని

విజయా! యే మట్లు అనుమానించుచు బెదరుచుంటివి? నన్నేవ తెగా భావించితి వేమి? నీసందేహ మేమియో నిక్కము వక్కాణింపుము.

అ ర్జు ను డు

మోహినీ! చెప్పదలచిన దేదియో చెప్పుము. సందిగ్ధభాషణంబు లచే నాయుల్లమెల్ల నెందులకు కల్లోలము గావించెదవు?

మో హి ని

(తనలో) శిరీషకుసుమపేశలసన్నిభసుందరసుకుమారము లైన యీతని కపోలము లింతలో నింత బిరుసుబారిన వేలనో? నాయుభార్గ

మును గ్రహించెనా యేమి? నేను రాక్షసాంగన నని నీత డేల్లు గ్రహింపగలండు? ఈతపితండ్రి యగు దేవేంద్రుండు యీతనిపై గల వాత్సల్యాబునం జేసి తాను నా కిచ్చిన నాపూర్వస్మృతివృత్తాంత మేమైన దెల్పెనా యేమి? అయినను ఒంటరిగాం జిక్కెనుగదా! మళ్లు పూర్తిగా తల కెక్కెనే యుండును. సరి, నాకా, యీతడు లొంగవలె! (ప్రకాశముగ) అర్జునా! నీ వుత్తమకులసంజాతుండవు. నిరుపమానపరాక్రమశాలివి. అదియునుగాక ధీనిధివి. దేశకాలపరిస్థితిస్వభావంబు లెరింగినవాడవుగావున దెల్పుచుంటిని వినుము. నేను చిన్నదానను. లోకజ్ఞాన మెరుంగని యబలను. తోడునీడలేని యొక్కతెను. గావున,

చ॥ పురుషులు కామయోగమున • బొంది మొదల్ తెగునన్ని భాషణల్
మురువులు నన్నచిన్నియుల • ముచ్చటలంగ్ గనుపర్చి స్త్రీలతో
నరి పరితృప్తులై వెనుక • చయ్యన బాసెద రయ్య పార్థ! నీ
తరుణమునందు తొల్లిటి యథార్థతదప్ప వరింప ని న్నికన్.

అర్జునుడు

(భయముతో) మోహినీ! మోహినీ! వరింపక న న్నేమి చేసెదవు?

మోహిని

వరింపక మానినప్పుడుగదా! యిప్పు డెందుల కాపశంక?

అర్జునుడు

తన్వీ! సోదరపతిహితబాంధవాళి బాసి, జన్మభూమికి దూరస్థుండనై కష్టసాగరమునం బడి దారిగానక కొట్టుకొనుచున్న నన్ను నీకృపానౌకను బెట్టి కాపాడితివి. ఇప్పుడు కోర్కెమరుగుపుచ్చి లేనిపోని పరుషవాక్యములచేతను, అనుచితములైన ప్రమాణములచేతను, న న్నేల యొప్పించెదవు? ఎట్టులైనను న న్నీద్వీపమునుండి యిందప్రస్థపురంబు జేర్చితివేని నిన్ను భార్యగా ఈనిమిషమందే స్వీకరించి నిన్ను రాజ్యసుఖాద్యుత్తమభోగములయం దనమానురాలనుగాం జేసి ని న్నన్నివిధముల నంతృప్తిపరచెదను. నన్ను కటాక్షింపవా? (అని బ్రతిమాలును.)

### మోహిని

(తనలో) అబ్బా! యెంత మత్తిడి మరపింపజూచినను ఎంతసంభాషణఁ జేసెను. ఇప్పటి కీతని యూహా నితనిలోనే జీర్ణింపజేసితిని. ఇంక కర్తవ్యమునకు గడంగెదను. (ప్రకాశముగ) పాండవమధ్యమా! యొక్కింత స్థిరుండవై యిటు వినుము.

చ॥ ఎఱుగుదు నీసహోదరుల • నెల్లవిధంబుల కామకాంక్షలో
పరిణయ మంది నొక్కసతి • భావజసౌఖ్యము గాంచి వారలే
కరుణ వహింపకే విడిచి • కష్టము బొందుదు రంతెగాక యో
నర! తమకిష్టమైన తగు • నాతిని గూడుదు రెవ్వ రక్కటా!

నిన్నొత్తిపాడుచుచుంటి నని భావింపకుము. నన్ను పరిధము మందు వెనుక నీవు వరించిన స్త్రీలవిధముననే వలచి వలపించి వలపు గొని నన్నుగూడ విడిచిపోయితివేని నేను యొంటరిగా నరసంచారములేని యీవముదరిమధ్యద్వీపమునం దుండజాలను. నీవు నన్ను విడువక యుందు నని ప్రమాణముజేసిన యెడల కొంతకాలమునకు మన మిరు పురము నీ పురమునకు మరలుదము. కాదంటివేని నాదారి నేను జూచుకొనెదను. ఇంక నీ పడు పాటులు నీవే గాంచుచు యనుభవింపఁగలవు. (అని పోఁబోవును)

### అర్జునుడు

(పైటచెంగు బట్టుకొని ఆపి, మనసులో) ఇది యంతయు నైంద్రజాలమువలె నున్నది. ఈ గారడీలమాయగాదుగదా! అయినను దీనిని విడిచిన నా కిప్పుడు గత్యంతరము లేదు. (ప్రకాశముగ) కాంతా! క్షమింపుము. నీయిచ్ఛ యేదియో అటులనే గావింపుము. నీమనమునకు నే నెన్నటికిని వ్యతిరేకముగా సంచరించువాడను గాను. ఇదియే నాప్రమాణము. (చేతిలో చేయివైచి) ఒక్కటిమాత్రము నీవు దయతో నంగీకరింపవలయును.

### మోహిని

అది యేమియో నిస్సందేహముగా వక్కాణింపుము.

అ ర్జు ను డు

సీ॥ మదదంతులను బట్టి ♦ మదమణంపఁగఁజాలు
కరువలిసూనుఁ డే♦కరణిగలఁడో ?
ధర్మంబు దప్పని ♦ ధర్మతినూజుఁడు
నారాకకై యెట్లు ♦ యుడలఁగలఁడో ?
కవలు నారాకకై ♦ కన్నీరు గార్చుచు
శాంతితో పురి నెట్లు ♦ జరుపగలరో ?
కుంతిద్రౌపదు లెట్లు ♦ ఘూర్ణిల్లుచును రాక
కెంత తీవ్రింబగు ♦ చింత గనిరో ?
తే॥ గీ॥ ఎటుల వారల క్షేమంబు ♦ నెఱుగువాడ
ననుచు గుందుచు నుంటిని ♦ నయపథమున
నన్ను గని నేడు వారల♦నయము దెల్పి
మించువేడుక నను కటా♦క్షించు మబల !

మో హి ని

ఇంతియేగదా ! ఇంతదూరము వచ్చి, యింతలో నింత యారాట పడిన, వారలయుదంత మెట్లు దెలియును ? నే నబలనుగదా ! నీకే తెలింప తరముగాని యీనీరాగారము తరింప నాతర మగునా ? నెమ్మదిమీద యుపాయ మాలోచించి యీయుపాయమును దప్పించుకొందము. తత్ప్రయత్నములు నేటినుండియే మొదలిడుదము. నన్ను స్వీకరించుట కేల సందేహపడుచు నాలస్యము జేసెదవు ?

అ ర్జు ను డు

ప్రాణేశ్వరీ, మోహినీ !

ఉ॥ ఓసరసీరుహాక్షి ! వినుమో మది సందియ మందనేల నీ
కేనతి బోల్పరాదు కృత•నిశ్చలత న్వేను మగ్నిసాక్షి నం
తాన మ దేల చంద్రరవి•తారలు దిగ్భ్రమనొందుగాక నీ
కోనము నిందు డాగి నిను•గోరి వరించితి రమ్ము కోమలీ !

(అని యిరువురు కౌఁగిలించుకొనుచు ఆతీవజొంపములు చాటుగా జేసికొని పూపొదలమధ్య మందగమనంబున బోవుచు ఆ కనబడుసౌధము సోపానముల నెక్కుచుండగా తెర నెమ్మది నెమ్మదిగాఁ జారును)

గద్య

ఇది శ్రీమద్వేణుగోపాలవరప్రసాదలబ్ధ నరసకవితాధురంధర దింటకుర్తి
వంశక్షీరార్ణవరాకాసుధాకర కౌండిన్యసగోత్ర కృష్ణమరాజపౌత్ర
పవిత్రగుణకదంబ గంటమాంబా గర్భశుక్తి ముక్తాఫల
వేంకటప్పలరాజ తనూభవ వినయగుణవిధేయ
విద్యాశేఖర బిరుదాంకిత భాస్కరవర్మ
నామధేయప్రణీతంబైన
భారతీయ నాటకంబునందు
తృతీయాంకము.

# భారతీయము

## చతురాంకము



ఇంద్రప్రస్థపుర బాహ్యప్రదేశము.

నారదప్రవేశము.

### నారదుడు

కాంభోజరాగము - ఆదితాళము.

యాదవకులతిలకా । కృష్ణా । మాధవ గోపాలా
కృష్ణా మాధవ గోపాలా
మాధవ మురహార । మంజులవేషా
గోవర్ధనోద్ధారా । గోపాలా॥ యా॥

బృందావనముని।వందితచరణా
వందన మో వరదా । గోపాలా॥ యా॥

మురళీగానవినోదన కృష్ణా
నారదనుతచరణా గోపాలా
రాధికవరరమణా॥ యాదవకుల॥

లీలామానుషవిగ్రహుం డగు శ్రీ మద్వేణుగోపాలకృష్ణుని లీల లత్యద్భుతములై తెలిసికొనుట కేరికిని తరముగాదు గదా! పాప మా వృకోదరుం డాదర్వీకరగ్రస్తుడై నేటికిని స్వస్థత నందలేదుగదా! పాప మా యర్జునుని కష్టములు దలంచినచో నవ్వు రాక మానదు. అనమాన ధనుర్విద్యా పారంగతుడై నిరువమాన వరాక్రమోపేతుడై యా రాక్ష

సాంగనా కల్పితమాయాజాల మోహములో బడి పలువుర పిల్లలం గాంచి తుదకు ఆ మోహినిచేత బడరాని పాదతాడనంబులం బడుచు వినరాని మాటల విని సహించుకొనుచు ఆ సముద్రమధ్యద్వీపంబున దరి గానక దిక్కులేక యొంటరినై యల్లాడుచుండెనుగదా! ఔరా భగవంతుని చైదము లెంత విచిత్రములు!

సీ॥ మేరువు తృణముగా ♦ మేదిని నొనరించి
తృణము మేరువుగాగ ♦ తోలి రచించి
పేదను ధనికుగా ♦ బెంపొందగా జేసి
ధనికుని బేదగా ♦ దనర జేసి
యిరవుగా నొకచోట ♦ నంతయు నేడ్పించి
సంతసం బొక్కచో ♦ సరగ నిల్పి
మకుటధారిని కను ♦ మాలగా నొనరించి
సేవకు రాజ్యాభిషిక్తు జేసి
తే॥ గీ॥ ధరను గల గర్వబోతుల ♦ దర్ప మణచి
బ్రోచు సుజనుల నేవేళ ♦ బొల్పు మీర
యెంత చిత్రములో గద ♦ యీశు డైన
రాధికాప్రాణలోలుని ♦ రచన లరయ

పాండవుల గాంచి రమ్మనిగదా శ్రీకృష్ణభగవానుడు నన్నంపినది. ఎంతలో యెంత మార్పు జరిగినది (యెదుటవరికించి)

మ॥ పురసౌధంబులపై పతాకములు సొంపుల్గుల్కు శృంగంబులం
బరము న్ముద్దిడ బోవున ట్లెసగి శోభస్ఫూర్తి బెంపొందు నా
పురసౌధంబులపై పతాకములు సొంపుల్వీడి శృంగంబులుం
మెరయ న్జాలవు భీమపార్థు లిట లేమిన్ జేసి హా మాధవా!

(అని చదువుకొనుచు నిష్క్రమించును.)



## ప్రథమరంగము.

విశాలముగల మయసభలో ఒకభాగము.

ధర్మరాజు, నకులుడు, పర్యంకముపై భీముడు, పరిచర్యలు జేయుచు ద్రౌపది, సహదేవుడు, వృషకేతుడు, మేఘవర్ణుడు ఉచితవేషముల ప్రవేశింతురు.

ధర్మజుడు చింతాక్రాంతుడై

### ధర్మరాజు

చ॥ అరిగెను పార్థు డెచ్చటికొ ♦ యశ్వము వెంటను భీమసేను డీ
యురగవిషాగ్నిలో బడి సు•ఖోన్నతి జెందగ జాలడయ్యె నీ
వరకును వాసుదేవుని వి•వాదమె సంకటమై జెలంగె; నే
శరణని నాదు సోదరుల ♦ గాంతునొ రాజ్య మికెట్లు జేతునో!

అర్జునుడు బోయిన మార్గమైనను యింతవరకు దెల్పువారు గానరారైరి. ఎవరినైన పార్థు నన్వేషణంబునకు బంపుద మన్నను నామనమేలనో ప్రతిక్షణంబును కీడునే శంకించుచున్నది. అప్పుడే శ్రీకృష్ణభగవానుని మర్మగర్భితశ్రీముఖమును గాంచి యనుమానించితిని. నేటివరకు నామహానుభావుని దర్శనము జేయక పోవుటయే మా యీ విపత్తులకు మూలము. కృష్ణా! ఆపద్బాంధవా! నీదయావిశేషము లేకపోవుట చేతనే గదా మా యీ చిలుగులకు మూలకారణము.

ఉ॥ ఎన్నడు నీదయారసము ♦ నింపుగ మాపయి జిల్కునందు వో
పన్నగశాయి! మేము బడు ♦ బన్నము లింకవు నెందునైన యా
పన్నశరణ్య! దీనజన•బాంధవ! సత్కృప జూపి మమ్ము సం
పన్నుల జేయ నీయదియె ♦ భారము, గోపకుమారశేఖరా!

తెలియక మేమొనర్చిన యపరాధముల మన్నించి, మా భీమపార్థుల తప్పులు క్షమించుము. అనాథరక్షకుడవైన నీవే యుపేక్షాభావమున నున్న మమ్ము రక్షించువా రెవ్వరు. నకులసహదేవులారా! యిప్పుడు మన మొనర్పవలసిన కర్తవ్యమేమి!

కుంతి

సహదేవా! నీవైన నను మార్గోపదేశికుడవు గాగూడదా? నీవప్రజ్ఞా బలమును నీవే మరచిన నే నేమనగలదానను? పాపము ధర్మజుం డంతగా దిగులు బడుచున్నను నీకు జాలి గలుగుట లేదా?

సహదేవుడు

తల్లీ! విధిబలము బలవత్తరమైనప్పుడు మానవప్రజ్ఞలు గొరగావు. గతించిన మహాత్తరమును యిప్పుడు ప్రయోగించినను ప్రయోజనము లేదు. పూడ్చినధనము యథారీతిగా శ్రమము లేక మనకు దక్కును గనుకనా! అదియును గాక నీకు తెలియని దే మున్నది? నా శాపము నైన నీవు గమనించి నా ప్రశంస మానుము. దైవనియోగచక్రము నెవ రెదురు ద్రిప్పగలరు? విశేషించి యిప్పుడు మనకు కాలము చాలని వేళగదా!

భీమసేనుడు

(హీనస్వరమున) జననీ! సోదరుడు దెల్పినది నిశ్చయము. ఇట్టి వెన్నియో నాకును గలవు. విపులముగా దెల్పుట కనువుగాదు. అట్టి యాజ్ఞలకు బద్ధుల మగుటచేతనే యన్నగారి యధ్వరము నిర్విఘ్నముగా కొనసాగుచున్నది. విశేషించి తెల్పుటకు నాకు శోషకూడ గలుగు చున్నది. అబ్బా! ద్రౌపదీ! కొంచెము నీరమిమ్ము. (ద్రౌపది యట్లు చేయ నకులసహదేవులు లేవనెత్తుదురు. మేఘవర్ణ వృషకేతులుపైన వస్త్రములు నద్దిపట్టుకొందురు. ధర్మజు డది గాంచి చింతాకులుడగును.)

ధర్మరాజు

తల్లీ! మరల యెందుకు భారతమొనర్చెదవు. చాలు యింతవర కైనదే హిమవంతప్రతిమానమై పెరుగుచున్నది. భగవత్కారుణ యిప్పటికే దూర మగుచున్నది. కర్తవ్యమును విడిచి మాటలాడకుము.

నకులుడు

అది గోచరించియున్న నింతకాల మేల యుపేక్ష జేయుదుము? కాక—

చ॥ ఇలఁగల సర్వరాష్ట్రముల • నెచ్చట నుండిన గాని పార్థుజా
డల గనుగొందమన్న భవ • దాజ్ఞయె సంశయవృత్తి నుండు ని
శ్చలమతి బూని నెమ్మదిగ • జాడ గనుంగొన బోదమన్న నిం
పలరగ నీదు యాజ్ఞ కృత • భావ మెఱుంగగ లేము యగ్రజా!

ధర్మరాజు

సోదరా! యేకరణి నాజ్ఞనిత్తును? ఇదివరకు సోదరవియోగముచే కుందుచున్న నా డెందము మరల మిమ్ము వాని నన్వేషింప బంప నొప్పకున్నది. ఏవిధమున పార్థుజాడ దెలియునోగదా!

సహదేవుడు

అగ్రజా! సందియ మందిన నెట్లు జాడ దెలియును?

తే॥ గీ॥ వెదుకుటయె నింక ముఖ్యంబు • విశ్వమంత
నందియుం బేల? మన పార్థు • జాడ దెలియ
దకట! నను బంపు తృటిలోన • నరసివత్తు
రమ్యగుణరాజ, విమలమా • ర్తాండతేజ!

వృషకేతుడు

తండ్రీ! యేల సందియ మందెదరు? ఏలోకమందున్నను గాలించి వెదకి తండ్రిగారి క్షేమవార్త దీసికొని వచ్చెదను. అనుజ్ఞనిత్తురేని యిప్పుడే ప్రయాణమై పోదును.

ధర్మరాజు

వత్సా! తొందర జెందకుము ఈ దిక్కు బోయె నని కొంచెము జాడ దెలిసిన నేనుమాత్ర ముపేక్ష జేయుదునా?

ఉ॥ ఉరుతరమైన సోదరవి • యోగముచే మది గుందుచున్న యీ
తరుణమునందు మీర లటు • దర్లిన తత్పరితాప మేను నే
కరణి భరింపగా గలను • కంజదళాక్షుని చిత్తవృత్తికిన్
గురుతరమైన సత్కృపను • గూర్పగ జేయు టికెట్లు బాలకా!

(అని అనుకొనుచుండగ నారదుడు ప్రవేశించును.)

నా ర దు డు

తే॥ గీ॥ విజయవిజయుంబు మీకు ధర్మజ! కుమార!
జయము యశ్వమఖాంచిత! జయము జయము
జయపురందరభోగ సం స్తవజయుంబు
జయము విజయంబు గొను మింక జయము జయము.

(అంద ఱెదురేగి తోడ్కొని వచ్చి యుచితాసన మిత్తురు. భీముడు అందఱి చేయూతచే లేచి నమస్కరించును.)

ధ ర్మ రా జు

సురముసీంద్రా! ఎక్కడి జయము. ఎక్కడి అశ్వమేధము.

ఉ॥ అంతు గనంగ రాక మన యర్జును డేగెను భీమసేను డీ
వంతున గుందుచుండె సుర వంద్య! పయోజవిశాలనేత్ర! ర
వ్వంతయు శాంతి లేదు హృదయంబు తపించుచునుండె సోదరుల్
చెంత వసింపు భాగ్య మిక చేకురు నెన్నటి కింక దాపసా!

నా ర దు డు

ధర్మతనూభవా, భీమసేనున కేమైనది. అర్జును డెట కేగెను. (భీముని వంక నడచుచుండును. అందఱు దత్తరు చిత్తముగా ననుస రింతురు)

ధ ర్మ రా జు

అనాడు తము రరుదెంచి పోయిన పిమ్మట యిరువురు గారడీ లరుదెంచి యేమియో నైంద్రజాలము జేసి మా సోదరపంచకంబు నిట్టి వియోగాబ్ధింద్రోసి చికాకొనరించిరి. భీమసేనుని ప్రాణములు నేటికి కుదుట బడవయ్యెను. గారడీల కల్పితంబగు మాయాఘోటకంబు నధి ష్ఠించిన పార్థుడేమయ్యెనో తెలియరాదు ఇందు దరిగానక విచారింపు చుంటిమి. తాము సకలలోకసంచారులు. మాసోదరుండైన సవ్యసాచి జాడ నెచ్చటనైన గానుపించెనా?

### నారదుడు

(తనలో) ఇప్పు డేమని ప్రత్యుత్తరం బీయవలయును. నిశ్చయ మెరింగింపనా? సందిగ్ధవచనంబులు జెప్పి తప్పించుకొందునా? ఏది యే మైనను కొంత యథార్థమునే వచించెద. (ప్రకాశముగ) ధర్మజా! నాఁడింద్రప్రస్థంబున మిమ్ముల గలియవచ్చి సురలోకంబున కరిగిన పిమ్మట కొన్ని దినంబులకు యూర్వశీకాంత దేవేంద్రుని సభాస్థానంబున కరుదెంచి కొంతవరకు నిజభంగిమంబులు జూపించి, సురనాథునిం గని యర్జును డొంటరిగా నుండిన క్లైబ్యంగవచ్చినది. నాటి శాపావధి నిర్వర్తించుటకు బో ననుజ్ఞనిండనిన సత్సరము బొమ్మని వీడ్కొలిపె; ఇందలి యథార్థం బెఱుంగ పురందరు నడుగ నిప్పట్టున మన్నించి ప్రశ్నింపకు డని నన్ను ప్రార్థింప మిన్నకుంటి. ఇందలి విషయమేమియో నాకే యింతవరకు బోధపడకున్నది.

### కుంతి

నాఁడు సంయమీంద్రా! యూర్వశితో నర్జును డొంటరిగా నుండె నని యెవరు దెల్పిరో అదియైనను మీకు దెలియకున్నదా?

### సహదేవుడు

అమ్మా! అనవసరసంభాషణంబుల మహర్షుల కేమిపని యున్నది. అదియును గాక అట్టి అవకాశములతో బాల్గొన నీ మహానుభావున కేమి యవసరము. మన కూరటగలిగింప నట్లు సమాదరించుచుండిరి లౌకికవ్యాపారము వారి కతినింద్యము.

### వృషకేతుడు

తమకు పదునాల్గు భువనంబులందును యనర్గళగతి జరించి సర్వ విషయంబుల దెలియంగల య నిర్వచనీయంబగు నొక్క శక్తి గలదు. యందు గాదేని దివ్యదృష్టిచే నైన భావికాలఫలంబులం గని మమ్ము పాలింపజాలరా?

నారదుడు

బాలకా! నీ వనినటుల నిశ్చయమే గాని, సురరహస్యంబగుటచే నంచు జోక్యము గల్గించుకొనుట మా కనావశ్యకము. మీరు తద్విషయమై నన్నింక బ్రశ్నింపకుడు. (భీము నుద్దేశించి) బాహుబలసంపన్నా, భీమసేనా! ఒక్కయల్పదర్వీకరం బెత్తజాలక నిట్లయితివా? నీబాహుబలం బేమైనది?

భీమసేనుడు

నా...ర...దా! (అని సంబోధించుచు లేవబోవుచుండ ధర్మజుడు వారించుచుండును. ద్రౌపదిపట్టుకొని తల్పముపై బరుండబెట్టి పరియత్నించును. నారదుడు నవ్వుచు తలపంకించును.)

ధర్మరాజు

శాంతిజితశరన్నిరదా, నారదా! విధి తప్పివచ్చినప్పుడు బాహుబలం బెక్కడ నక్కరకు వచ్చును? ఎంతటి వారికి గాని పౌరుషము జెల్లునే?

తే॥ గీ॥ సింహ మొకగతి శశకంబు॰చేత జిక్కు
రహి మిహిరమండలము జేరు ॰ రాహువునకు
దైవగతి దప్పె నని మది ॰ దలతు రందు
నరుల పౌరుష మన నెంత ॰ సురయతీంద్ర!

నారదుడు

(స్వగతము) ఆహా! యీతని క్షమాదిగుణసంపత్తి ధర్మవిధి నెంత నొప్పియున్నది. ఈ మహాపురుషుని వలననే వీరి సోదరుల గౌరవములు నిలుచుచున్నవి. (ప్రకాశముగ) అకటా! దైవనిబద్ధ మగుతరి మన మేమి చేయగలుగుదుము? ఔషధసేవ జేయించినారా?

ధర్మరాజు

అమర వైద్యులకడనుండి యౌషధములు దెప్పించుట కర్జును డుండినగదా! అనుజుఁడు వచ్చిన తరువాత నౌషధవిధాన మాలోచింప వలయు ననుకొంటిమి.

నారదుడు

మహానుభావుండును, యశోదానందనుండును నగు శ్రీమద్వేణు గోపాలకృష్ణునకు దెలియబరచక పోతిరా?

ధర్మరాజు

తెలియపరచితిమి. అచ్చట యాదవులకు కొన్నికలతలు బయలు వెడలెనట! ఇటుల నచ్చుటకు ప్రస్తుతము వీలుగాదని నొకవార్త నంపెను; ఏ ముహూర్తమునం దశ్వమేధము మొదలిడితిమో అప్పడే మా కిట్టి యిక్కట్లొనగూడినవి. మాగతు లెట్లుగా పరిణమించునో గదా!

సీ॥ ఏనాడు మాభీమ • సేనుండు గర్వియై
యసురాంతకుని దూల • నాడినాడొ
యేనాడు మాపార్థు • డీల మదాంధత జెంది
దనుజారి దూషింప • దనరినాడొ
యేనాడు కవల వా • రింపక వినువొంది
తమ్ముల బాపంగ • దలచినానొ
యేనాడు వ్యాసుం • డిదేటి మూర్ఖత యన్న
దలపక విననట్లు • నిలిచినానొ
తే॥ గీ॥ యప్పుడే, నందనందను • యమలకరుణ
కిలను దూరులమై నిల్వ • దలచినాము
నాటినుండియు బన్నముల్ • చేటొనర్చె
నయ్య- గుణసాంద్ర, సురవంద్య, • యమలచరిత!

నారదుడు

ధర్మనందనా! విచారింపకుము. కరుణాసాంద్రుఁడైన యా యుపేం ద్రునిదయ రాకమానదు.

స హ దే వు డు

సురయతీంద్రా! యింకెక్కడి యుపేంద్రుని దయ?

మ॥ అనఘా! కమ్మ లిఖించి బంపినపుడే ♦ యానంచు గాదంచు మా
కనిపెట్ట వెంటనె శ్రీముఖం బొకటి యా ♦ కంసాంతకుం డంత నే
మని యూహించెనొ యింతమాత్రమున కే♦మాయె న్గదా! మీద యా
వనజాతాయతపత్రనేత్రుడు విధి ♦ న్వారింపగా శక్యుడే.

నా ర దు డు

అవును. మీ యీ వ్యంగ్యోక్తుల మూలమున మీపై మోప బడెనని యూహించుట మీ విశాలహృదయత్వము వెల్లడియగును.

న కు లు డు

చ॥ చులకనజేసి మమ్ము నెప ♦ జూచుచు నుగ్రత మర్మభాషణల్
బలుకుచు నిట్లు సేయుటది ♦ శాడియె? జాలిక మానిచంద్ర నే
దెలిసితి నేడు నారదయ♦తీంద్రుడు దుష్కులవాలుం డటన్న మా
టల నిజభావము న్గల యు♦థార్థము నేటికి స్పష్ట మయ్యెడిన్.

(ఈ పద్యము చదువునప్పుడు ధర్మజుడు వారించుచుండును. వృషకేతు మేఘవర్ణులు ధర్మజుని తీక్ష్ణముగా జూచుచుందురు.)

నా ర దు డు

నకులకుమారా! యింకనూ శ్రీమన్నారాయణుని మహిమ లెఱుంగలేక మావంటి జడదారులపైనా నీ మర్మభీషణప్రతాపములు! శాంతింపుము చాలు.

వృ ష కే తు డు

తే॥ గీ॥ ఉన్నయవి లేనిపోనివి ♦ కొన్ని కల్పి
తములు జేసియు ధరలోన ♦ తంపు బెట్టి
సుజనులకు నష్టములు గూర్చ ♦ సాంపెఱుంగు
నిన్ను బూజింప నర్హంబె ♦ నేడు యనఘ!

ధ ర్మ రా జు

ఆహా! ఇట్టి యన్యాయము తగునా? ఇదివరకే దైవదూష ణంబున కిన్ని చిలుగులుజనులట పరల భగవద్దాసుల దూషణమా? ఇది యంతయుజూడ నతారశేదిరో కల్పాంతము ప్రారంభముగా నున్న టులనే యున్నది. శ్రీ ... ... హా!

సీ॥ నుతిజేయదగినట్టి ♦ యుతికులోత్తంసుని
పరుసంబుగా నిట్లు ♦ బలుక దగునె?
పలికిన భీమపా♦ర్థులు నెట్టి చిలుగుల
గనుచుండిరో మీరు ♦ గాంచలేదె?
నలువురు నాల్గుప్ర♦క్కల జేరి బిరబిర
యమరవంద్యుని నిట్టు ♦ లనుట దగునె?
శక్రితనూజు డే♦జాడ నుండె నటంచు
నిదమిత్థ మని వచి♦యింపనీయ
తే॥ గీ॥ రనిలసుతు డేవిధంబున ♦ నలరగలడొ?
పార్థు నేరీతి మన మిల ♦ బడయగలమొ?
యా విధము దెల్పవచ్చిన ♦ యమలచరితు
దూషణము జేయ మన కది ♦ భూషణంబె?

మే ఘ వ ర్ణు డు

చ॥ విమలు లటంచు నిట్టి యవి♦వేకుల బూజ లొనర్ప వార లే
కుమతిని జ్ఞానశూన్యతను ♦ గోల్పడి దాము వరోన్నతిౕ గుణ
క్రమమున జేయనేరకయె ♦ గందురు నుర్వి జనాపవాదముల్
శమదమనాదినత్క్రియల♦జాడ గనుంగొనలేని తాపసుల్.

వీరివలననే గదా మన మిన్ని కష్టములందుటకు మూలము. వీర లే నిశ్చలభక్తిపరాయణులైనచో లోకంబున నిన్ని కలతలు లేకుండు గదా!

ధ ర్మ రా జు

కుమారా! మాటలాడకుము. ఈమహానుభావుడే లేనిచో నిన్ని సచ్చరిత్రములు భరతదేశమున బయలుదేరక మనజన్మభూవాసులు

సాహిత్యాదికళలు లేక యితరదేశములకు మార్గదర్శకులు గాక యెంత మూఢులుగా నుండెడివారలో యది గానుగొంటివా ?

న కు లు డు (ధ్యానం)

ఆఁ! నిజమే, ఈ మహానుభావుడే లేకయున్నచో దేశ మధోగతిపాలు గావలసినదేనా యేమి ? ఏమి నీ వాక్పాండిత్యము !

తే॥ గీ॥ ఎదుట హితములు బల్కియు ♦ వెనుక మరలి
నంత యహితంబు బలికెడి ♦ యార్యవర్యు
లనగ వీరలె నందందు ♦ టరయ జగము
ధర్మబద్ధంబు నగుల య♦థార్థ మనఘ !

నా ర దు డు

(నవ్వుచు) ధీరోత్తంసులారా ! మావంటి జడదారులపైనా మీ యుక్తిప్రయుక్తిసంభాషణంబులు ! నిష్కౌతుకముగా నాపై నేల యలుక బూనెదరు ? మిమ్ములను, నన్నును, సకలచరాచరములను పాలించి రక్షించగల సమర్థుం డా నందనందనుడు గాని మరెవ్వరును గారు. ఇఁక మీ మీ బింకంబుల విడిచి పవిత్రహృదయారవిందులై శ్రీ మద్వేణుగోపాలుని నమ్మి భజించిన నిశ్చయముగా మి మ్మే యాప దాపవాదంబు లంటవు, గావున నా వాక్యములు సావధానముగా నాల కింపుడు.

సీ॥ నెమలిఱెక్కల వంటి ♦ నెమ్మేను గలవాడు
చిరునవ్వు మోవిపై ♦ జెలఁగువాఁడు
జిలుగు బంగారు దు♦స్తులు ధరించెడివాడు
సురుచిరం బగు ప్రేమ ♦ జూపువాడు
పదియారు వేల గో♦పాంగన ల్గలవాడు
కడుపార భువనము ♦ ల్గన్నవాడు
వలపు లూరెడి చిన్ని ♦ పలుకులు గలవాడు
యోగుల మనములం ♦ దుండువాడు

తే॥ గీ॥ పదములం గన్న జాహ్నవి • పదమువాడు
ఎవుడు భోగీంద్రుపై బవ•ళించువాడు
యిలను సుజనులటన్న బ్రే•మించువాడు
భగవదవతారమై నేడు • బరగినాడు.

విదురుడు

యథార్థము! ఈ మహానుభావుడు వచించినది పావనిర్మాలనోప
దేశము! అజ్ఞానతిమిరభాస్కరము!! అనుపమానందమయము!!!

మ॥ ధరణీభార మడంప పూర్వసుర సం•తానంబు శిక్షింప యా
పరసీజాక్షుడు యుర్గనాభిగతి సం•సారం బవిచ్ఛిన్నతక్
మెరయ న్జేయ దశావతారముల స•మ్మేళించి యోగార్థ్వ డి
క్కరణి న్సృష్ట్యను నాట్యరంగ మెవరుక్ • గానంగరా రక్కటా!

నారదుడు

పాండవులారా! వింటిరా, లీలామానుషగోపాలమూర్తిమహిమాభి
వర్ణనము! మీరు తొందరపడి సుజనుల నిందింపకుడు.

చ॥ ఇతరుల నింద సేయు టస • సెంతటివానికి నొప్పబోదు య
పత్రిము డనాదిపూరుషు డ•పారదయాంబుధి దీనపోష సం
తతవిహితోపకారి కృత•తంత్రుని నింద యొనర్చినట్టి దు
ర్మతి పరమైహికంబులకు • మాన్యుడు గాడు దలంప నెన్నడున్.

సీ॥ విషమును దినిపించి • విపదంబుధిని భీము
ద్రోయునా డెవడు మీ • ద్రోహదంబు
కౌరవు ల్మిమ్ముల • గాల్పగా లక్కింట
బెట్టునా డెవడు మీ • పట్టుగొమ్మ
నిజపత్ని సభమధ్య • నిల్పి కోకలు విప్ప
వ్రీతి వల్వ లొసంగు • నూతగట్టి
పడి సని మీకు స•ర్వజయంబు లొసగూర్చి
శత్రుక్షయ మొనర్చు • మిత్రధనము

తే॥ గీ॥ అట్టి వసుదేవముద్దుల • పట్టి కరుణ
మరచినప్పుడె యిప్పాట్లు • తరిమి వచ్చె
మోము గని వేడ నతడు స • మ్మోదము జెంది
నేరమే మాది యన్న మ • న్నింపగలడు.

కుంతి

సురమాసిందా్రి! నిశ్చయమే. తనను సర్వకాలసర్వావస్థలయం దును నమ్మి యున్న మమ్మి నీరీతిగా నెప్పటి కప్పుడు యీావిధముగా పరీక్షించిన తన కయ్యెడి లాభ మేమి? ఆ మహామహుని కృపవలన పాండుకొమరులు కొంత కీర్తియో యపకీర్తియో గణించుకొనియే యుండిరి.

సహదేవుడు

జననీ! పుణ్యము గాని పాపము గాని, యశము గాని యపయశము గాని పాండవులకు పరమాత్ముడే పంచియుండె నని నమ్మి మరల హింసా రూపకమును దేశారిష్టమును నైన యీ యశ్వమేధక్రతువిధాన మేల మొదలిడవలయును? ఇది నీకు సమ్మతమా?

కుంతి

మన జన్మకర్మవిధు లెరింగిన సమ్మహానుభావుండు కాలానుసర ణంబుగ పరివర్తనంబు జేయనీయక యప్పుడప్పు డిట్లు పరీక్షింప దా నెఱుంగని దే మున్నది?

నారదుడు

అమ్మా, పాండురాజధర్మపత్నీ! మహానుభావుండగు వాసుదేవుని జన్మకర్మవృత్తాంతంబు లెవ్వరుం దెలియజాలరు. జన్మను గనబోవు ప్రతిజీవియు కర్మవశంబున జరించుటయేగాని సుఖ మన నెన్ని జన్మంబు లకును గననేరదు. భావిఫలాభిలాషియై జీవి కాలమును వెళ్ళదీయును గాని సుఖము మృగతృష్ణవంటి దని భావింపలేదు. అట్టిదాని నాసించి యే జీవి సకలకష్టంబులకుం బాల్పడు. జీవు డది విడిన వెనువెంటనే

దేవుఁడు కాఁగలఁడు. అప్పుడు మన మొకరి నొక్క యాశ్రియవృత్తిం గన జాలము. మరియు నో పృథా! ఒక్కసారి నీహృదయమును విశాలముగా విస్ఫారింపజేసి ఆ దేవుని పుట్టుపూర్వోత్తరంబులు ఒక్కింత విచారింపుము.

కీరవాణిరాగము—ఆదితాళం.

అమర నిభులకైనా । యలవి యగున తెలియా
శ్యామసుందరుని । జన్మవివరములు॥ అ॥

భవునికైన వానవపద్మ । భవులకైన హరి మహాను
భావుని నిజజనన మింత । భావింపఁగ నలవియగున॥ అ॥

తెలిసికొనిన దెలియని యా । జలజనిభనయనుని సత్
లీలలను తలంపఁగను । నలవి యగున తెలియఁగ॥ అ॥

భీముఁడు

నిశ్చయము. సందేహ మెంతమాత్రమును లేదు. కృష్ణా, ఆప ద్బాంధవా! నిజము. బావా! మహానుభావా! ఆపద్బాంధవుండవని తెలిసు కొనలేక తూలనాడితిని. మరచిపొమ్ము. నన్ను క్షమింపుము. కారుణ్యరస భరితాంతరంగా! ఆర్తరక్షామణీ! కృష్ణా! మన్నింపుము. ద్రౌపదీ!యార్త త్రాణ పరాయణుం డగు శ్రీమన్నారాయణుని పదకమలప్రక్షాళనం బొనరించి శృంగారంబగు బంగారురంగారు నీ యంశోత్తరీయంబున నీ లోకపావనుపదరాజీవంబు లొత్తుము. సోదరా! విజయా! కనకకలశం బులతో నీరమ్ము గొనిరమ్ము బావా! నిన్ను జూచుటకు మా కను లెంత కాయలు గాచినవి! వెన్నతో బెరిగిన నీ నవకోమలనీలాంబుదసన్నిభ దేహము బిగియార కౌగలించుకొని యెంత కాలమైనది! అనిన మాటల మరచి నన్ను క్షమింపుము. కృష్ణా, కృష్ణా, కృష్ణా, కృష్ణా, కృష్ణా, గోపాల కృష్ణా! (అని పలవించుచుండగా ద్రౌపదీ ధర్మజులు, కవలు, వృష కేతు మేఘవర్ణులు, విదురుఁడు మొదలగువారు నెమ్మదిగా బట్టుకొని తల్పంబున బరుండబెట్టుదురు. నారదుఁడు తత్సమయానుసారముగా మాటలాడును. ధర్మజుఁడు కన్నీటితో)

ధర్మరాజు

సీ॥ కవ్వడి యరుదెంచి ♦ కమలనాభుని చెంతి
నున్న భాగ్యముగాంచు ♦ టెన్నడొక్కొ-
కరువలిసూనుండు ♦ కలవరంబు దొలంగి
యెలమి సుఖంబుండు ♦ టెన్నడొక్కొ-
మా నేరములు సైప ♦ మాధవుం డరుదెంచి
యింపుమై కరుణించు ♦ టెన్నడొక్కొ-
వేదాంతవేద్యుఁ డే♦వేళ మా పురిగాంచి
వెలయ సంతోషించు ♦ టెన్నడొక్కొ-
తే॥ గీ॥ నరుడు నొంటరిగా నట ♦ కరిగె నొక్కొ-
మరల నిజపురి కెన్నడు ♦ మరలునొక్కొ-
దెల్ప ప్రార్థించుచుంటి నో ♦ దివ్యచరిత!
సకలసురవంద్య! నారద♦సంయమీంద్ర!
(అని చరణములపై బడును.)

నారదుడు

దీర్ఘాయుష్మాన్ భవ! లెమ్ము లెమ్ము, ధర్మజా! లెమ్ము. దైవయోగంబున మీ కచిరకాలంబుననే శుభంబులు గలుగుగాక! శ్రీమన్నారాయణుని దివ్యచరణారవిందంబులు నిస్సంశయంబున హృత్సరోజంబున నిల్పి నుతింపుడు. పార్థునకు గీ డేమియు జరుగదు. ఇంక శ్రీకృష్ణపరమాత్మ నిట కొక్కపరి దోడ్కొనివచ్చి యీ భీమసేనునకు గన్పఱ్చెదు. భగవానుని సందర్శనం బూరక బోనేరదుగదా! నే బోయివత్తును. (అని లేచి హరినామస్మరణం బొనర్చుచుండ అందఱును లేచి ముకుళితకరకమలులై సాగ నంపుదురు. భీమసేనుడు నెమ్మదిగా వందనంబు సల్పును. ద్రౌపది నమస్కరించి భీమునకు పరిచర్యలు జేయుచుండును. వారు నడచుచుండ ద్రౌపది భీముని తల్పముముందునకు వచ్చును. అందఱు సాగనంపుచు బోవుచుందురు. తెరజాఱును)

సీ॥ చిననాటినుండి జేసిన చెల్మి యొక్కింత
మరచి సత్కృప నింప • మానకయ్య
దళితవిపత్తుల • దప్పించి కృప వీడి
బాధించు టేలొకో • పరమపురుష!
యెనలేని కష్టము • లెన్నియో తొలగించి
మము వీడనాడ కో • మా నివంద్య!
యెరుగక జేయు మా • చిరుత నేరములెల్ల
పాటింప నెంచ కో • భ క్తవరద!
తే॥ గీ॥ ఇల త్రయోదశవత్సరా • లిడుమ లెల్ల
గడిపి జయ మబ్బజేసి తో • కమలనాభ!
అట్టి మము నేడు బ్రోవంగ•దయ్య కృష్ణ!
యఖిలకల్యాణగుణసాంద్ర! • యాదవేంద్ర!

(ఇంతలో నందరు ప్రవేశించి భీముని తల్పము చుట్టును జేరు దురు.) మీర లీ విధంబుగా చింతించిన ప్రయోజనంబు లేదు. నేడు నేను ప్రయాణమై ద్వారకాపురికి బోయి యాపద్బాంధవుం డగు శ్రీమ న్నారాయణు నొక్క త్రుటికాలంబున దోడ్కొని వచ్చెదను, గనుక మీ రనుమతించి న న్ననుపుడు.

న కు లు డు

ఏదియో సాకు జెప్పి రాకపోయిన నేమి జేయుదువు?

ద్రౌ ప ది

రాక పరాభవము జరుగు ననియా మీ యభిప్రాయము? నన్ను పరాభవమునుండి గాపాడిన పార్థసారథి నన్నే పరాభవించునా? యిప్ప టికా, మీకు భయము గలుగుట!

స హ దే వు డు

మాట వచ్చినప్పుడు మమ్ములను, మా చెయ్దములను యెత్తి పొడుచుట నీ వింకనూ మానవై తివి గదా!

ద్రౌ ప ది

ఇంకనూ అనగా మీ యభిప్రాయ మేమియో తెలియకున్నది. రాజసూయాధ్వరము మొద లింతవరకు మీ మూలమున యెంతలేసి పరాభవములు జరిగినను యోర్చికొని మీ కష్టములు నావిగా భావించి భరించినందుల కింకనునా ?—లేక మీయందు వ్యతిరేకముగా నుంటి నని యింకనునా ?—అన్నగారి యనుజ్ఞ వలన మీక్షాత్రధర్మము నిలిచినదే యని యింకనూనా ?— ఏమి యీ యింకనూ ?

న కు లు డు

ఇలాంటి విపత్కాలమున నీ వింగితజ్ఞురాలవైనచో నీవిధముగా పరుషవాక్యము లాడవు. ఏల నీకీ సాహసవృత్తి ?

ద్రౌ ప ది

ఔను! (అని పెద్ద యెలుంగున యేమో చెప్పబోవుచుండగా)

భీ మ సే ను డు

సోదరులారా! యెందుల కీ గృహకల్లోలము. దేని కీ వృథా వాగ్వ్యయము. వృషకేతుని సహాయంబుగా నిచ్చి దేవి నంపుడు. నాకును నమరవందితచరణారవిందుడైన గోవిందుని సందర్శింప కౌతూహలము పెచ్చుపెరుగుచున్నది. ఆమహానుభావుని, ఆదేవదేవుని, ఆ నీలమేఘశ్యాముని సందర్శనభాగ్యమున గాని నా కీ యురగవిషానలబాధ చల్లారనేరదను వ్యాకులమి పూర్తిగా నున్నది. కావున మీరు తల కొకమాట మాట లాడక నా ప్రాణంబుల కాంక్షింతురేని దేవిని సత్వరముగా ద్వారకానగరంబున కనుపుడు.

ద్రౌ ప ది

(ధర్మజు నుద్దేశించి)

ఉ॥ మూగివిధాన యన్నిటను ♦ ముక్కను మూసుక శాంత మూనియు॥
ఆగగ రాని కార్యములె ♦ యాచరణం బొనరించుచుందువా

యాగువ నీయుజాల వది • యెంతనమర్థత యిప్పుడైన నీ
మూగితనంబు మాని మది • మూర్ఖత వీడి కన్ను బంపుమా.

ధర్మరాజు

(గంభీరముగా ద్వేషధ్వనితో పరుషముగా) దేవీ! యెవ్వరినోట విన్నను నీ నాలుగైదేదులనుండియు దూషణభాషణంబులే గాని భూషణభాషణంబులు వినదమన్నను వినబడకున్నవే! ఇది కాలమహిమమా, లేక మనకండ్ల కావరమా?

ద్రౌపది

(శోకదావాగ్నిక్కిన తాపముచవలె రోజుచు రోదనస్వరమున)

సీ॥ అనుచితంబగు జూద•మాడి కాంతల నోడు
టరయుగా కండ్ల కా•వరము గాదె?
పరుడు నా తల బట్టి • బడబడ నీడ్వగా
పరికింప కండ్ల కా•వరము గాదె?
కొలువున నను సిల్పి • కోకలు విప్పగా
మరి జూడ కండ్ల కా•వరము గాదె?
యూరుల జూపి న • న్నూలనం బాడగా
వరు వీడ కండ్ల కా•వరము గాదె?

తే॥ గీ॥ సర్వవిధములఁ శుభములు • జరిపి యుష్ట
కష్టముల దీర్చ నేర్చిన • కమలనాభు
కడకు బంపు మటంచు నే • నడుగ నీవు
పలుకకుండుట కండ్ల కా•వరము గాదె?

వృషకేతుడు

తండ్రిలారా! కర్తవ్యమును నిర్వర్తించుట కిన్ని తటమటములు బడ నేల? ఎవ్వరియొద్దకో బోవుటగాదు గదా! బాంధవుండును పరమ పావనుండును నైన వాసుదేవుని కడకు గదా! ఎందుల కింక నుపేక్షించెదరు? తల్లి గారి మాట యంగీకరించి సత్వరముగా బంపుడు.

స హ దే వు డు

అందుల కెవ రేమి వ్యతిరేకముగా మాటలాడిరి?

వృ ష కే తు డు

తండ్రిగా రనుజ్ఞ నీయవలయును గదా!

న కు లు డు

అన్నగారు బంప మనిరా? శాంతి నొందుము.

ద్రౌ ప ది

ఉ॥ శాంతము శాంత మంచు దమ•శక్తిని డా చిటు భారతావనిన్
భ్రాంతిని ముంచి పూర్వగతి • భావము గప్పిన శాంతిగూడి య
శ్రాంతము కుళ్ళుచున్ కుమిలి • జచ్చుచు మూలుగు చీముజేయు నీ
శాంతముతోడ కార్యములు • చక్కనజేసి మెలంగ నేర్తుమే!

(సానునయముగ) నిశ్చయముగా నీ మాటను గుర్తుంచుకొనుడు. దూరము మాత్ర మాలోచింపుడు.

తే॥ గీ॥ ఉష్ణరుధిరంబు మేనుల•నుండ క్షాత్ర
శతుత్రతతి యుండి నిర్వీర్య•జాడ గనుచు
భరతవంశకళంకులై • పాండుసుతులు
మెలగి రనునట్టి యపకీర్తి • గలయకండి.

ధ ర్మ రా జు

(నెమ్మదిగా) దేవీ! ని న్ననవలసిన దేమియు లేదు. మమ్ముల మేము నిందించుకొన నగత్యమును లేదు. మనకర్మ మెట్లున్న నట్లు జరుగును. నీవు నేడే బయలుదేరుము. అక్కడ నమయోచితముగా సంభాషణలయందు పాత్రోచితముగా మెలంగుము. భగవానుని సోదరియైన సుభద్రను గూడ వెంట దోడ్కొని పొమ్ము.

కుం తి

నాయనా! యిప్పుడు సుభద్ర వలదు లే! చిన్నది యగు నుత్తర వద్ద నుండవలయును. దాని కేమి తెలియును, పసిగాయను పాలించుట?

భీ మ సే ను డు

అమ్మా! అనుచితముగా మాటలాడకుము. అగ్రజా! సుభద్రను గూడ ద్రౌపది వెంట తప్పక బంప ప్రార్థించుచుంటిని.

స హ దే వు డు

అన్నగారు వచించినట్లు దేవి! నీవును, వదినగారును వెళ్ళినందు లకు వీరపత్ను లనిపించుకొని రండు పొండు.

ద్రౌ ప ది

(కొంచెముగా నవ్వి) ఇది యేమియు యుద్ధసందేశము గాదు గదా! మన కింకనూ బింకము లేలాకో?

ధ ర్మ రా జు

కుమారా, వృషకేతూ! ద్రౌపదీసుభద్రలను పదిలముగా ద్వారకా నగరమునకు గొనిపొమ్ము. కేశవుడైన వాసుదేవునితో నా పలుకులుగా నిటుల విన్నవించుము.

తే॥ గీ॥ బాల్యముననుండి మము నేలు ♦ ప్రభుడ వీవు
యాపదలయందుఁ దోడ్పడు ♦ నమలమతివి
పాండవక్షేమకరుడను ♦ ప్రతిథ నిల్పు
కొనుము గోపాలకృష్ణ! నీ ♦ వనవరతము.

స హ దే వు డు

నా వచనములుగా నిట్లు దెల్పుము.

తే॥ గీ॥ సకలమును నీవు పాలన♦సలుపు చిట్లు
కష్టముల బెట్ట జూడియే ♦ కమలనాభ!
ఆశ్రితుల బ్రోచు దైవ మీ♦వైన వేగ
రమ్ము మము పాలనము జేయ ♦ రమ్ము కృష్ణ!

న కు లు డు

నా మాటలగా నిట్లు విన్నవించుము.

తే॥ గీ॥ జడియు వారల జడిపించి ♦ జగతియందు
దిరుగుచుందురు లోకులు ♦ దీనపాల!
సకలమును భరించి మ మ్మిట్లు ♦ సాగదీయ
భావ్య మగునొక్కొ! గోపాల ♦ దివ్యచరిత!

భీ మ సే ను డు

వృషకేతూ! నా ప్రార్థనగా నిటుల విన్నవింపుము.

చ॥ తెలియక నిందొనర్చితిమి ♦ దేవనుతాంచితదివ్యపాద!
పలుకు లుపశ్రుతి న్గొనక ♦ పార్థనమీరులతెప్పిదంబులన్
జలరుహనేత్ర! నీ మదిని ♦ చయ్యన ను చక వేగవచ్చి మా
చిలుగు లడంప వేడెదను ♦ శీఘ్రమె గోపకుమార శేఖరా!

(ద్రౌపదీవృషకేతులు లోని కేగుదురు.)

భీ మ సే ను డు

బిల్హరిరాగము—రూపక తాళము.

పొరపాటున నిందించితి । పురుషోత్తమ! ద్రోన మనకు
నిరతము నీ చరణ మనఘ । నెమ్మి నమ్మియున్న మేము॥ పొ॥
కరివరద! పయోజగర్భ! । మురహార! నిను దూషించితి
మరచిపొమ్మా మా నేరము । మదనజనక! తెలియక నే॥ పొ॥
కనకాంబర! కమలనాభ! । కంసహారణ! రిఘాభ(జన!
వనజనేత్ర! నీలగాత్ర! । వానవాదినుతచరిత్ర! పొ॥
ఉరగబాధ నున్నవాడ । గరుడగమన! రక్షింపుము
నరగున వెనువెంట వెడలి । జాగుజేయ కిటు రమ్ము॥ పొ॥

(అనుచుండగనే ఒక్కొక్కరు లేచిపోవుచుందురు. తెర నెమ్మది నెమ్మదిగా జారుచుండును.)

## ద్వితీయ రంగము

ద్వారకలో విశాలరాచనగరియొక్క సౌధము. రంగోచితాలంకారములు.
రుక్మిణి, సత్యభామ, ద్రౌపది, సుభద్ర
మొదలగుస్త్రీలు ప్రవేశింతురు.
కొంతసేపైన తరువాత శ్రీకృష్ణుడు మొదలగువారు ప్రవేశింతురు.

### రుక్మిణి

(ద్రౌపది చేతులు మృదువుగా నిమురుచు, ఆదరముగాను, పరిహాసముగా నవ్వుచు గంభీరధ్వనితో) వదినగారు పట్టమహిషులైన తరువాత ద్వారకానగరమునకు వేంచేయుట యిదే ప్రథమము గాబోలును! బహుకాలమైనదిగదా! (సుభద్ర నాదరముగా) మా సుభద్రాదేవి గూడ మమ్ములను మరచిపోయినది. నేటి యీ కలియక మాకు కడుంగడు సంతోషదాయకము.

### సుభద్ర

(సత్యభామతో రుక్మిణి నుద్దేశించి) వదినే! వదిన వదనాంబుజము నేడు కందువారి గంభీరముగా నున్న దేమి?

### సత్యభామ

భద్రా! ముసలితనము వచ్చుట లేదా? అయినను నన్నడిగిన నే నేమని దెల్పగలదానను?

### ద్రౌపది

(రుక్మిణితో) వదినగారు! నన్ను నూతనముగా సంభావించి సంభోధించుచున్నారు. ఏ విధమైనను హృదయమున సంతోషము లేక యే పగిది రాగలుగుదుము?

### సత్యభామ

(ద్రౌపదితో) అన్నగారు భీమసేనునకు కొంచె మారోగ్యముగ నున్నది గదా! నడయాడుచుండిరా? (సుభద్రవంక దిరిగి) మా సోదరుండగు విజయునిజాడ నరయుట కేరినైన బంపియుండిరా?

ద్రౌ ప ది

అది తెలిసిన మనకు మనస్తాప మేల యుండును? దీనికి దోడు మా యన్నగా రగు శ్యామలాంగుని దయ గూడ లేకపోయెను గదా!

రు క్మి ణి

మా వదినగారు భర్తల యెడబాటు కొంచెమైనను సహింప జాలరు గదా! అందులకే కాబోలును మా యన్న లెచ్చట యున్నను మిమ్ము విడువజాలరు! ఎట్లైనను నీవు కడుంగడు సమర్థురాలవు. వదినే!

చ॥ మురిపెములుం బ్రియోక్తులు ♦ ముచ్చటలుం దగునట్లు నేర్పుగా
సరసముతోడ సేవలను ♦ సల్పియు భర్తలమానసంబుల
న్నరమరలేక లోగొనియు ♦ నందర తృప్తి వహింపజేయు నీ
సరి తరుణీమణుల్గలరె ♦ జాణవు ద్రౌపది, మానినీమణీ!

స త్యా భా మ

(సుభద్ర నుద్దేశించి) వదినే! అక్క రుక్మిణి వచించినది యథార్థము. పెద్దవదినగారు నిక్కముగా నంత పాత్రత గలవారే!

ఉ॥ ఈ తరుణీశిరోమణి యు♦నేకసపత్నులు నేను గాథయుం
యాతతభక్తిప్రేమవిన♦యాదిగుణంబుల దృప్తిజెంద నం
ప్రీతి నొనర్చి మీ యనుజు♦ప్రేమకు బాత్రత నొందలేక మే
మీతరి కెట్లు లుంటిమి సు♦మీ! నిజమేగద! యీపె వాక్యముల్.

ద్రౌ ప ది

(తనలో) వీరిరువురి సంభాషణము లోకేతీరున నుండి కొంచె మసూయాజనకముగా ధ్వనించుచున్నవి. అయినను కార్యార్థినై వాసుదేవునితో పనియుండి వచ్చిన నాకు పౌరుషము జెల్లనేరదు. నేను మర్మగర్భితముగా గూడ నీపట్టున పలుకజనదు. (ప్రకాశముగ) మా యన్నగారి దేవేరులగు మీ యప్రతిమానుగ్రహమున పాండవేయులు నాయం

దంత యనురాగయుక్తలై యుండిరి. అంతియే కాని, నాయందు గుణ విశేషము గాని, సౌందర్యవిశేషము గాని యొంతమాత్రమును లేదు. (రుక్మిణీసత్యభామలు ఒండొరులు సైగలు జేసికొందురు అది సుభద్ర భద్రముగా గ్రహించును)

సుభద్ర

వదినలారా! ఆపదవేళ వచ్చి మీ మరుగు జొచ్చితిమి. మీ మీ జుగుప్సాకరోక్తులు విడనాడి సంప్రీతిగా సంభాషింపుడు. అప్రియోక్తులచే నిదివరకే కృశించుచున్న మా హృదయంబుల మరింత ఘూర్ణిల్లకుండ జేయగలందులకు ప్రార్థింపుచుంటిని. (వినయముగా యిరువురిమీదను జేతులు వైచును.)

రుక్మిణి

(ద్రౌపదితో) పాండవపట్టమహిషీ! యిం దప్రీతికరములైన భాషణము లేమున్నవి? దూషణము లేమున్నవి? అయినను మేము గాని, మానాథులు గాని మీ యాపదల గడువం బెట్టగలంత సమర్థులమా?

ద్రౌపది

(తనలో) ఈవిడ యేదియో తలంపుతోడనే మాట లాడు చున్నది. ఎన్నడూ యింత ఈర్ష్యాలాపము లెరుగని యీ పతివ్రతా శిరోమణి యేలనో తన పూర్వస్మృతియైన దలంపక పల్కుచున్నది. అనువుగాని కాలమున నెవ్వరి నోట యేది రావలయునో విధి యాతీరున బల్కించి తీరును. అయినను నేను శాంతముగానే ప్రవర్తించవలయును. (ప్రకాశముగ)

మ॥ పదమూడేడులు సర్వబన్నములలో ♦ బాలించి కౌంతేయులా
వదల న్జాలని ప్రేమతో ననిశమున్ ♦ వర్తించి యీనాటి యీ
పద లూహింపక మిన్నకుండి వెతలన్ ♦ బాటింపగారాక దా
మది నే డేమి దలంచెనో యకట! యా ♦ మాన్యుండు సామాన్యుడే?

స త్య భా మ

ఏమీ, మీకు కష్టములు గూర్చెనా? అవును. చిన్నతనము నుండియు మేనత్తకొడుకు లని యెంచక భరింపరాని బన్నములు మా పతి యొనర్చిన మాట నిశ్చయమే ఆహా! యేమి ద్రౌపదీ! నీ నిష్ఠు రాలాపములు!

సీ॥ ఖాండవం బనలుండు • గాల్పించు నప్పుడు
కంసాంతకుడు మిమ్ముఁ • గష్టబెట్టె
దూర్వాసు డలనాడు • దుండగంబు దలంప
శ్రీనాధు డెంతయో • చేటుబెట్టె
కురురాజు సభను నీ • కోక లూడ్చెడు వేళఁ
బరమాత్ము డెంతయో • బాధబెట్టె
అంధుండు భీముని • నడరి కౌగిలి బట్ట
కౌస్తుభధారి యిక్కట్టు బెట్టె
తే॥ గీ॥ కుంభసంభవు శంతను•కొమరు కర్ణు
సింధునృపతిని కురుభూమి • జెందునపుడు
యీశు డా కృష్ణు డెంతయో • యెగ్గు జేసె
రాజ్య సామ్రాజ్య మొసగి యో • రమణిమిన్న!

సు భ ద్ర

(తనలో) ఇ దేమి విపరీతము? అంతగా మమ్ము మేళతాళము లతో ప్రత్యుత్థానము జేసి, యిప్పు డీరీతి ప్రత్యాఖ్యానము జేయు చుండి రేలనో! నిందించి రని తెలిసె గాబోలు! మరల మమ్ము పరు షోక్తుల నొప్పించుచుండిరి. కానిమ్ము. ఎట్లునూ మేము శాంతమునే బూని యుండవలయును?

ద్రౌ ప ది

నారీశిరోమణులారా! మహాత్ముం డగు శ్రీకృష్ణపరమాత్ముని నాపతులు కృతఘ్నులై నిందింపబట్టియే మా కిన్ని కష్టంబులు సంప్రా

ప్తించినవి. అందువలన శ్రీమన్నారాయణుని పార్థించి
విముక్తులను జేయుటకు దోడ్కొని పోవ వచ్చితిమి.

స త్య భా మ

ఈ పలుకు లెంత సమంజసముగా నున్నవి !

రు క్మి ణి

సోదరీ ! సమంజసములే గాక, సమర్థములుగా కూడ నున్నవి.

కం॥ అందఱిని బ్రోచునపుడ డా
నందము గొందఱిని బ్రోవ • నపరాధంబా
నందిన జట్టును, మరలన్
అందక పోయినను చరణ • మంటుటె గాదే !

సు భ ద్రి

(తనలో) అబ్బా ! వీరలు బల్కెడి పల్కు లొక్కొక్కటి యొక్కొక నిశితశిలీముఖమై మా హృదయపుటంబుల భేదించుచు మా సర్వావయవములు భరింపరాని బాధ నొదవజేయుచున్నవే. అక్కటా ! రాచపుట్టుక యెంతకోపోద్దీపకమైనది ! అయినను మే మిప్పుడు క్షమచేతనే వీరలను శాంతుల నొనర్పవలయును. (ప్రకాశముగ) గంభీరభావశోభిత హృదయులారా !

ద్రౌ ప ది

(సుభద్రను వారించి) శ్రీమంతులారా ! మన్నింపుడు.

మ॥ నరవిభ శ్రీ వసుదేవనందనుడు కం•సద్వేషి నారాయణుం
డరవిందాక్షుడు శేషశాయి వరదుం • డానందసంధానుడై
తరుణీరత్నములార ! తొల్లిటి కృపన్ • ధన్యాత్ముల జేసి యి
త్తఱి దా మమ్ము వృథాశ్రమ జ్ఞానుపుటల్ • ధర్మంబుగా దక్కటా!

ఇంక వేయుమాట లేల ? మీరలును కరుణాసాంద్రులగుచు నప్పరమపవిత్రుని ప్రసన్నత వేడి మాకు చేయూత నొసంగుడు. (అని గడ్డములు బట్టి బ్రతిమాలు చుండును. రుక్మిణీ సత్యభామలును

మానము వహింతురు. శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వుచు దూరమున నుండి వచ్చుచుండును.)

రు క్మి ణి

తే॥ గీ॥ ఉవిద మా పల్కులకు నీవు • యులికే దేల?
పరిహాసంబున వదినని • బల్కుచుంటి —

స త్య భా మ

అమలశాంతిస్వభావి వీ • వగుటచేత
నొనర క్షమయందు క్షితియంచు • నుడువ వచ్చు.

ద్రౌ ప దీ సు భ ద్ర లు

అన్నా! వేణుగోపాలకృష్ణా! వందనములు.

రు క్మి ణీ స త్య లు

హృదయేశ్వరా! నమస్కారములు.

శ్రీ కృ ష్ణు డు

కల్యాణులారా! అభ్యుదయ మగుగాక! సోదరీమణులారా!

తే॥ గీ॥ బాహుబలశాలి విక్రమో • పార్జితుండు
భీమసేనుండు కుశలియే • ప్రియనఖుండు
నమితశస్త్రాస్త్రనంవేది • యైన పార్థు
జాడ యేమైన దెలిసెనా? • జలజనేత్రి!

ద్రౌ ప ది

(మోకరించి శ్రీకృష్ణుని పదములకు నమస్కరింపుచు) లోక త్రాణపరాయణా! నారాయణా! నాయందు సోదరీవాత్సల్య ముంచి తెలియక జేసిన మా యపరాధముల మన్నించి మా పురమున కరుదెంచి మమ్ము రక్షింప ప్రార్థించుచుంటిమి. ఇవే మీ పాదంబులకు వందన శతంబులు.

సుభద్ర

అన్నా! యే క్షేమము లైనను, మీ రరుదెంచినమీదటే.
(అని కృష్ణు నాలింగనము జేసికొనును.)

సత్యభామ

(కృష్ణునితో) పోనీ! యిప్పటికైన మీరు జ్ఞాపకము వచ్చినందులకు సంతసింపవలసినదే. పాపము! తోబుట్టువులు పదములం బడి పదేపదే ప్రార్థింపుచుండిరి. పోయి చూచివచ్చు టుత్తమము.

సుభద్ర

వదినలుగూడ సోదరునితోబాటు కరిపురంబున కరుదెంచి మమ్ముల ధన్యుల జేయుడు. (అని యిరువురను బ్రతిమాలును.)

శ్రీకృష్ణుడు

రుక్మిణీసత్యభామల పరికించి చిరునవ్వుతో నిరువురిని చెరియొక చేతిక్రిందకు దీసికొని) ఏమీ, మీ ముఖారవిందములు ముడుచుకొని [illegible]చిన యరవిందముల వలె లజ్జపడిన తరువాత నంతసించిన తెరంగున నున్నవి? మా సోదరీమణులతో పరిహాసవాక్యములయం దోడిపోలేదు గదా! (అనినలువురను గంభీరముగా దిలకించును.)

సుభద్ర

అగ్రజా! పరిహాసభాషణంబుల కేమి గాని, పరాభవభాషణంబులు మాత్రము కొన్ని యెన్నడు మమ్ముల పలుకని వదినలు నేడు—
అన్నా! యేమని దెల్పుకొందును? వలు బన్నముల బడి పరమాత్ముడ వగు నీ పాలనమువలన నెట్లో రాజ్యపదప్రాప్తుల మైనంతన పడిన బన్నములను మరచి బ్రతుకుచున్న మాకు మరల నిట్టి యుత్పాతములు తటస్థించుటచేత పరితపించుచు నీ పాలబడి ప్రార్థించుటకు రాగా పలుకవలసిన సంభాషణములే పలికిరి. పోనీ! అవియైనను మా మగవారల లోపముల వలననే గాని, వీరి ననవలసిన పని లేదు.

శ్రీకృష్ణుడు

సోదరీమణులారా! విచారింపకుడు. దేవేరులారా! మీ రింకను పాతోచితమును తెలిసికొనలేదుగదా!

తే॥ గీ॥ విమల మగు నగ్నిలోన పవిత్రముగను
జన్మ మందిన సుగుణ యీ జలజనేత్రి
యనుచు దెలియక నేమైన నాడిరేని
మన్ననతో వేడుకొనుడు క్షమాపణంబు.

రుక్మిణి

(ద్రౌపదీసుభద్రల నుద్దేశించి) మే మంటి మని కోపము వచ్చినదా! యాదుబిడ్డలముగనుక యనవలసి వచ్చినది. అలుకకు కారణం బైన మమ్ము మన్నింపుము.

సుభద్ర

నారీశిరోమణులారా! నిశ్చయమును మా కటింగించిన మీయందు దోష మేమియును లేదు. (బుజ్జగించుచు) అన్నా! యింద్రప్రస్థపురంబున కనుకున్నంత త్వరలో బయలుదేర ప్రార్థన. మీరాక కై గమనమునకును, మీ సందర్శనప్రాప్తికిని వారు నిమిష మొక యుగముగ గడుపుచుందురు? గావున... (అని యేమో చెప్పబోవుచుండగా నారదుని గానము వినిపించును.)

నారదుడు

శంకరాభరణరాగము — ఆదితాళం.

కమలదళనయన। శౌరీ!
విమలచరిత, కృష్ణా, । మురారీ!॥ క॥
సురగరుడోరగ। సన్నుతచరణా!
శరనిధిశయన; । భవాబ్ధితరణా!॥ క॥
భవభయబంధవిమోచన। నూత్న
పావనమునివరదా, । ముకుందా!॥ క॥

శ్రీకృష్ణుడు

సురమునివరా! నమస్కారములు.

స్త్రీలందరు

దేవర్షి చంద్రమా! వందనములు.

నారదుడు

సుఖీభవ, సుఖీభవ, సుఖీభవ! ద్రౌపదీ! యువరాజగు భీమసేనునకు కుశలమా? అర్జుని వృత్తాంత మేమైన తెలిసినదా?

ద్రౌపది

మహాత్ములగు మీకు తెలియని దే మున్నది? అయినను లీలాగోపాలుని కృప రానిదే, భవాదృశులు కనికరించనిదే మాకు శుభములు కలుగునా?

నారదుడు

ఔను, తల్లీ! శ్రీమన్నారాయణుం డగు నీ వసుదేవనందనుని కరుణయే గదా! మీకును, మాకును, సకలచరాచరజంతుకోటికిని గావలసినది. అమ్మా!

మ॥ అమరేంద్రాదిసురల్ నుతింప నసుర•వ్రాతంబులం దుంపగా
విమలుం డీ హరి దేవకీతనయుఁడై • వేదాంతవేద్యుండు నై
కమలాక్షీ! ధర నుద్భవించెను సుమా! కల్యాణసంధాయియై
అమలాత్ముం డగు కృష్ణసేవనము గా•దా! యాశ్రయం బన్నిటన్.

సుభద్ర

మహాత్మా! ప్రాకృతుల మగు మే మీ మహాత్ముని మహిమలు తెలిసికొనగలమా? తమవంటి భక్తాగ్రేసరులకే తెలియవలయును గాని___

నారదుడు

అమ్మా! యే మంటివి?

సీ॥ వేదరక్షక విశ్వ•వేదాంతవేద్యుఁడై
వరలిన పతితపా•వను డితండు
జనవంద్యతను సర్వ•జగదభిరాముఁడై
బరగిన శ్రీరమా•పాత్రు డితడు
దైత్యుల దునుమాడి • ధరణీభరము మాన్ప
యవతార మెత్తిన • యనఘు డితడు
ప్రళయాంతమున చిన్ని•పాపడై వనధిపై
ఘనయోగమున నున్న • ఘను డితండు
తే॥ గీ॥ ఆదిమధ్యాంతరహితుఁడై • యలరు నితడు
ఈశులకు నీశుడై తేజ•రిల్లు నితడు
జగము లెల్లను గారడీ•చందమునను
యడచు, సృష్టించు, దెలియు మో•యబలమిన్న!

ద్రౌపది

మానిచంద్రా! ధన్యోస్మి! ధన్యోస్మి! నిజముగా నాడు వచించి నది యథార్థము. ఈ మహానుభావుని గుణముల నేరుపరుప యా ఫణి రాజునకు మాత్రి మలవియగునా? (నారదకృష్ణులం జూచి తనలో) వీరి వైఖరులు జూడ నా కేమో స్ఫురించుచున్నది. ఏమై యుండునో గదా!

శ్రీకృష్ణుడు

(స్వగతము) రహస్యము నెఱుగని యీ నారదుఁడు గారడీ డనుచుండెను. ఈద్రౌపదియు నాడు వచించినది యథార్థ మనుచున్నది. మా యిరువురం గనిపెట్టుచు సుభద్ర తల వంకించుచున్నది. ఈ నార దుడు మరల పాండవులకు మేము జేసిన గారడీ దెల్పియుండడు గదా! (ప్రకాశముగ) మానిచంద్రమా! మా సోదరీమణులు మమ్ముల నింద్ర

అజాతశత్రుడు, నకులసహదేవులు వృషకేతునితో నేమి దెల్పిరో పోయి మేము గనుగొందుము. (శ్రీకృష్ణనారదులు నడచుచుండ యవనిక జారును.) నాటి యూర్వశీ శాపవిమోచనమే తమకు యత్యవసరమైన కార్యము. అయిన నే తెరవుపై మీ రట కరుగుదురు.

నారదుడు

నే నొక సమయంబున దేవేంద్రుని వైజయంతమున నున్నపుడు సురరాజు దర్బారున కిరుపురు గారడీ లరుదెంచి రనియు, ప్రథమమున యీ ఘోటకమును జేసి దీనిమీద నెక్కివచ్చినవారలే ధీమంతు లని యేమేమో ప్రజ్ఞలను పౌరుషవాక్కులను బల్కగా వారల మాయా విశేషమున నా మనసు జిక్కి నేను నాలో లేక యీ హయముపై నెక్కి యంతరిక్షమున దిరుగుచుండగా నీ విందు గాన్పింప నిట కవత రించితి నని దెల్పి, యర్జునున కాహయము నిచ్చి, నే నూర్వశిపాలికిం బోయి 'నాతీ! నీకు శాపోపశమనసమయం బాసన్నమైన' దని దెల్పుచు నీ విప్పట్టున నీబాలురతో నింద్రప్రస్థపురికి బోయి అక్కడ జరుపవలసిన విధానము దెల్పి యట్లొనర్పవలయు ననియు మన మిరుపురము నిర్వ ర్తింపగల మనియు నూర్వశికి జెప్పి అర్జునునకన్న ముందుగా నే నట కరుదెంతును. మీ రేగి యింద్రప్రస్థపురమున భీముని యురగబాధ మాన్పుడు.

శ్రీకృష్ణుడు

అటులనే గాని యింద్రప్రస్థపురంబునకు వచ్చిన తదుపరి వారల కందఱకు ఈశ్వరవిలాన మెరుక పర్చవలయును. అది అంతయు ఆరాత్రి సాంగన కెఱుంగ బల్కుము. నీ వీ రూపముననే బోయెదవా?

నారదుడు

కాదు. దేవేంద్రుని కుమారుడైన జయంతరూపమున. యింకే మైన సనుజ్ఞయా!

వశిష్ఠపురి కాహ్వానింప వచ్చిరి. రేవటి యరుణోదయంబున బయలు నుంటిమి. తమరుగూడ సమయమున కరుదెంచితిరి.

నా ర దు డు

అఖిలలోకకల్యాణకారణా, నారాయణా! అవును గాని, కొంచె మవసరమైన కార్య మున్నది. (సాలోచనముగా) అందువలన దేవ దేవుండ వగు నీతో వచ్చు సుకృతము నాకు లేనందులకు చింత నొందు చున్నాను. మీరు కరిపురికి జేరునరికి నే నట కరుదెంతును. వేరుగా భావింపకుడు.

శ్రీ కృ ష్ణు డు

మానిచంద్రమా! మాకు దెలుపగూడని కార్యావసరమా? లేక రహస్యమై యుండునా?

నా ర దు డు

సాక్షా ద్విష్ణుండవైన తమకడనా! మా రహస్యములు. దేవర యాన తిచ్చితిరి గనుక మీ...తో...డ...నే—

ద్రౌ ప ది

(తనలో) వీ రిరువురి పలుకుల పర్యవసాన మేమో స్ఫురింప కున్నది. ఈ కపటనాటకసూత్రధారిరహస్య మేమై యుండునో?

రు క్మి ణి

సోదరీ! యేదియో యొక వన్నాగము మీద పోరాటము బెట్ట నిదే జీవనము గడుపని యీ నారదుని జన్మ మెట్టిదై యుండునో గదా!

స త్య భా మ

అందులకే మహాత్ముల మహిమలు వాచామగోచర మనిరి.

శ్రీ కృ ష్ణు డు

దేవేరులారా! సోదరీమణులగు ద్రౌపదీసుభద్రలను మంగళ స్నానములు చేయించి రాజోచితముగా మర్యాదమన్ననల నలరింపుడు.

శ్రీ కృష్ణుడు

అశ్వమేధక్రతు వున్నది గదా! అప్పటికైన యర్జునునకు బుద్ధి గలుగక పోయిన

ఉ॥ క్రతువిధాన, నన్ను నిజసార్వభౌమునిగ నెంచక నవ్యసాచి లో
కత్రయవీరు నంచు మది గార్వము నవ్వడి దూషణంబు తా
పత్రయబుద్ధి జేసిన నపాత్రుని గాగ దలంచి మూర్ధము
గాత్రమునుండి వేరుగను ఖండనజేయుదు నిశ్చయంబుగన్.

సరి! ఆ విషయము లన్నియు తరువాత నాలోచింతము. యింక నీ వరుగుము. (నారదుడు హరినామస్మరణ జేయుచు నిష్క్రమించును)

నారదుడు

తోదకవృత్తము.

కాఫీరాగము—చతురశ్రగతి.

సురనుతచరితా! । సురుచిరకరుణా
శరనిధిశాయీ । వరనవచన! యో॥ సు॥

గరుడగమన, నీ । కరుణను సుగుణా
కర! నిను గని సాకగ దయ నిడవా॥ సు॥

శ్రీ కృష్ణుడు

అశ్వమేధమే ఆలోచింప దగిన విషయము! ఈ విధాన మంతయు నెరవేరుపవలసిన బాధ్యత నాపై బెట్టుదురు. నిర్వర్తింపక తప్పదు. అంతభారము నిర్వహించిన నా కిది యొకలెక్కయా? కాని మిగిలిన భూతములను మాత్రము పవరించుకొనవలసిన బాధ్యత మాత్రము లేదా? అన్నిటి కన్ని నిర్మాణములు జేసికొనియే యుండవలయును. నే ననంతకోట్యవతారధారినై దత్తత్కాలానుగుణ్యంబుగ దుష్టుల శిక్షించుచు శిష్టుల రక్షించుచు మదగర్వంబున కన్నుగానక చరించెడు గర్వాంధులగర్వంబు సర్వంబు ఖర్వంబు గావించుచు భక్తపోషణు డను ఖ్యాతిం

గాంచితి. నేడును నట్టి గర్వాంధుల శిక్షించుటకే యిట్టిలీలల నాడు చుంటిని. ఇంతటనైన భీమపార్థులు గ్రహించిరా సరి, లేక నారచన కేదు రేమున్నది? అంతయును గాంచుచుండెద గాక!

ఆదితాళము — కాంభోజిరాగము

నను దెలియగ తరమా
గనుగొన భరమా॥ న॥

ఇలలో జనములు । కలిమిగ దలచుచు
బలమదగర్వాలు । అలతిగ నెంతురు॥ న॥

సకలమునకు కారణుండ
సకలంకుడ సపరూపుడ॥ న॥

(పాడుచు నిష్క్రమించును)

గద్య

ఇది శ్రీమద్వేణుగోపాలవరప్రసాదలబ్ధ సరసకవితాధురంధర దింటకుర్తి
వంశక్షీరార్ణవరాకాసుధాకర కౌండిన్యసగోత్ర కృష్ణమరాజపౌత్ర ।
పవిత్రగుణకదంబ గంటమాంబా గర్భశుక్తి ముక్తాఫల
వేంకటప్పలరాజ తనూభవ వినయగుణవిధేయ
విద్యాశేఖర బిరుదాంకిత భాస్కరవర్మ
నామధేయప్రణీతంబైన

భా ర తీ య నా ట కం బు నం దు

చ తు ర్థాం క ము.



# భారతీయము

## పంచమాంకము



### ప్రథమరంగము.

సముద్రమధ్యద్వీపము, ప్రాతఃకాలము.

(మోహిని, పిల్లలు, అర్జునుడు ప్రవేశింతురు. సౌధమువెనుక నున్న వరండాలో అన్నివిధములైన వంటసామగ్రులు నానాగందరగోళముగా)

మోహిని

నలాధమా! క్షారజలంబుల నావిరిజేసినంతమాత్రంబున నీపని దీరినదా? వంటజేసిన యంటుపాత్రంబుల నితా తెవడు శుద్ధిజేయును. పిల్లలు జేసిన యీ యశౌచపువస్త్రంబుల నెవ్వ డుతుకును? ఆబాలు రటుల నమేధ్యము శరీరములం బులుముకొని తిరుగుచుండ నీకండ్లు కనుబడుటలేదా! ఎంతజెప్పినను నీసోమరితనము మానవు. ప్రతిదినంబును నీకు మర్దనమంత్ర ముపదేశించుచుండినగాని నీకు గుణముతిరుగదు. (అని కూర్చున్న యర్జునుని శృంగారకట్టెతో రెండు చరిచి గుడాకేశ ముల బట్టి యీడ్చి రెండుపదతాడనంబు లొసంగును) లే! లే! ఈ యింటి పనంతయు నెవ్వరు జేయుదురు? ముందు, ఆపిల్లలశరీరము గడుగుము.

అర్జునుడు

(అలా జేయుచు తనలో) నాబ్రతుకంతయు దినగండము నూరేండ్లాయుర్దాయ మన్నట్లుగా నున్నది. నాబుద్ధి భూము లేలుటయందును, వ్రాత గార్ధభంబుల గాయుచున్నట్లును పరిణమించుచున్నది. ఈపిల్లల నెడబాయలేను. ఈపాపిని బెట్టుకష్టంబుల భరింపలేను. (అని ఆలోచించు

చుండగా మోహిని కోపముతో గుసగుసగా హుంకరించుచు పైకి వచ్చుచు)

మోహిని

అరే, నరాధమా! ఎంతసేవు? ఏమా యాలోచనము? పారిపోవ నుంకించుచుంటివా? త్రిలోకంబుల దాగినను నీప్రాణములు నాయరచేతిలో నున్నవిగా భావింపుము (అని అనుచుండగా నక్కుడనున్న గుడ్డలతో పిల్లల దుడువబోగా) అదేనా పని! కట్టివిడిచిన వస్త్రము లేనా? నీకు దొరకినవి. ఆగుడ్డలతోనేనా నాబిడ్డల దుడుచునది. (అని లాగి పారవేసి అవతల కీడ్చి తన్ని యిన్నియితర విడిచినగుడ్డలు యిన్ని మురికిగుడ్డపీలికలు ముందు పడవేసి) యీపాడిబట్టలతో శుభ్రముగా దుడువుము. (అని యిటు నటు చీదరగా దిరుగుచు గందరగోళముగా నుండును. పిల్లలు అర్జునుని విసిగించుచుందురు. అర్జునుడు రెండుచేతుల లోను తలబట్టి)

అర్జునుడు

తే॥ గీ॥ దివ్యవనితగ భావించి • దిగులులేక
బ్రతుకగల ననుకొంటి యి•బ్భంగి నేను
నీచతరమైన యబలతో • నెనయుగలుగు
తెలివిగనలేక నాతెల్వి • తెల్లవారె.

మోహిని

అరే, నీచమానవా! ఏమా యవధాన ప్రయత్నములు? ఒంటరిగా నున్నది. ఇది యేమిచేయు నని తలంచుచుంటివా? మిమ్ముల నన్నివిధంబుల సమర్థింపజేయుటకు మాకున్న యుపకారంబులే చాలును. పాప మని శాంతించినకొలదిని, నీయాటలు మేరమీరుచున్నవే! రుచ్యములగు పదార్థములు పచనముజేసి పెట్టుచుండగ మెక్కి, సకలయూడిగంబులజేయుచుండ సంతసించి, దివ్యభోగంబుల దేల్చుచుండ ననుభవించి, చేదోడువాదోడుగా నున్న యానందించి, స్త్రీ తమిదీరగా నిట్లు జేయు

—రూపక తాళము.

ప॰ నా

సరమగు నా॥ వి॥

ఏనుఖము నభిలషించి । భావము నతివతిత జేసి
భవసాగరదరి గానక । భువి బ్రతికిన ఫలముగలదె॥ వి॥

ఇలజనముల తలనాలుక । వలె మెలగక చరియించిన
సులభగతిని నిందజెందు । నలలితయుక్ మూడు తుదకు॥ వి॥

ఆహా! కాలమహిమ దెలిసికొన నేరికి తరమగును. మాకష్టము లేనాటి కంతములేకపోయెనే? జగదేకవరాక్రమోపేతులమై చతుస్స ముద్రముద్రిత మహీమండలంబునం గల రాజన్యవరేణ్యులలో యస మానుల మని పేరుగణించి, సర్వసురసర్వయక్షగంధర్వగరుడకిన్నర కింపురు షోరగసిద్ధసాధ్యమానవ సంఘంబులలో నిరుపమానకీర్తిని గణించి, కురు క్షేత్రసంగ్రామంబునకు ప్రథమమందు ధర్మమునకు కట్టుబడియు, అనం తరంబున భయంబునకు లోబడియు, మెలంగవలసివచ్చెను గదా! ఎన్ని విభవము లెన్నిభోగము లెన్నిరాజ్యంబు లున్నను ప్రయోజనంబేమి? కాల మనుకూలముగా నప్పుడు సర్వంబును నిష్ప్రయోజనంబుగదా! పంచవర్షంబులు గడచిపోయినను, నా కీరాతుసాంగనచే బడు పదతాడ నంబులు దప్పలేదుగదా! యెన్నటికైన నః యీకాంత యుపకారస్మృతి గలదై తనను ప్రేమించి మోహించి వివాహమాడినందులకు నన్నింద్ర ప్రస్థపురంబునకు జేర్చి నాసహోదరులతో గలుపు ననుకొంటిని గాని నన్నింత హేయంబుగా శాదంబుల దన్ని యీడ్చి యీ యవమానమ

౹ఠించు నని కలన్నై న ఒ
_ ఌ గాంచిన యే మనుకొందురో!
ఒ_ను? ఆహా! నాపాృణములు బాయుట_
కున్న దే, పోనీ దీనికి దెలియకుండ పారిపోవుద వ
నుపాయంబుగాని సాధనముగాని లేకున్న దే? ఔ౹
నిరంతరనిశాచరీ చరణతాడనంబులును, నాసోదరుల
లును, అవశ్యానుభోక్తవ్యంబులే, అయ్యో! యిట్టి
మును విని నాసోదరులు న న్నేమిగా భావింతురోగదా! ఎన్నటికైనను
కష్టము లిట్లే యుండునా? నాసోదరులను కలిసికొనలేకపోదునా? జన్మ
భూమి యగు నిందృప్రస్థపురంబు జేరలేకపోదునా? యున్నను మొండి
ధైర్యముతోనే స్త్రీయైదుపత్సరంబులు గడపితిని గాని యింకమీదట
దుర్భర మనిపించుచున్నది. ఏమి జేయువాడను? పోనీ, సాహసించి
యీనముదృమును తరింతమన్నను యెటుజూచినను జలమయము దప్ప
మరేమియు గాన్పింపకున్నది. ఎంతకాల మీదవలయునో? ఈదిన
దరిగానరానిచో నిష్కారణముగా మరణించుట దప్ప మరి వేఱుగతి
గానరాకున్నది. నే నొనర్పవలసిన కార్యంబు లెన్నియో యుండ నే నిప్పుడే
మరణించిన యశ్వమేధాదికృతువు లెటుల నిర్వర్తింపబడును? ఆహా!
యేమి నావెఱ్ఱియూహాలు? నాలో నాకే నవ్వువచ్చుచున్నది. నవ్వు
దునా? దుఃఖింపనా? కడకాళ్ళబడి నమస్కరించినను ఈరాక్షసాంగన
లన్నితన్ని యీడ్చునుగాని, న న్నిందుండి నిర్గమించునుపాయంబు
బోధింపకున్నది. ఈయుపాయం బే యుపాయంబున దప్పునోగదా! ఇట్టి
యిక్కట్టులో కర్తవ్యంబు బోధించుటకు మా దేవకీపట్టియైన పార్థసారథి
లేడుగదా! (నిదానించి ఆలోచించి) అబ్బా! యిప్పటి నాయీ నీచ
స్థితికి ఎంతని విచారింతును. ఎంతని విషాదపడుదును.

సీ॥ సురమకుటంబుతో • శృంగారమున దేలు
శిరము రాకాసి చీ•రలను దాల్చె
చతు రబ్ధి వేష్టిత•క్షితిని మోయు భుజంబు
లకట యమేధ్యప•త్రములు మోసె

వరె శుభ్రముగా నుతికికొనిరమ్ము, పొమ్ము. (అని అర్జునునిచేతులలో బట్టలను లాగుకొని పిల్లలను ధరింపజేయుచుండును. అర్జునుడు ఆగుడ్డలన్నియు పోగుజేసికొని, విధిని గడువతరమగునా యను కీర్తన జదువుచు నిష్క్రమించును.) నాశాపావధి సమీపించినది. ఇంక నావిధియందు నేను ప్రవర్తింపవలయును. ఆహా! దేవమాయ లెంత కుతంత్రములై దుర్భేద్యములైనవి. ఈసుర లెంత మాయావులు. వారివారిభోగభాగ్యంబుల పెంపొందజేసికొనుటకు నితరజాతుల నుపయోగించుకొందురు. ఆహా! యెంతకఠినులు? తమయున్నతికొరకు యితరుల నీచముగా నెంచువారలు సురలుగాబోలును? యీతంత్రము దెలియక దేహసౌఖ్యమున కాసించి ధనమును నమ్మి తుచ్ఛజీవనమునే ప్రధానముగా నెంచి ఆత్మస్వాతంత్ర్యమును గోలుపోయి విశ్వహృదయములేక యెంద అధోగతిపాలగుచున్నారు. ఓవిశ్వపతీ, ఓదేవాధిదేవా! ఓజగన్నేతా! గాలిలో విహరించు పతంగశ్రేణిస్వేచ్ఛను పాలించితివి. రాతిలో నుండు మండూకతతిని గాపాడితివి. నీటిలో నుండు జలజతతి నేలితివి. మానవజన్మముత్తమమని విర్రవీగు మహాపండితుల నేల గాపాడజాలవు? జాలిబూనుము. దీనబంధూ! సేవాభారము తొలగింపుము. విశ్వమానవకల్యాణము ప్రసాదించుము. సర్వము నీరచనవలె భేదరహిత మొనర్పుము. (తెరజారును.)



మువా? పురుషుండ నని మీానములు దివ్వుదువా? అదుగో అకర వాలంబుచే పరవర గొరిగించెదను. జాగ్రత! స్త్రీలు బానిస లనియా మీాపురుషుల యభిప్రాయము. యూరుగాయ లనియా నీయుద్దేశ్యము. మూగవాడవా?

సీ॥ హితులు బాంధవపురో♦హితులు బంధులు మిత్ర
తతుల మధ్యను మహా♦తంత్రములను
జెలులు మంగళహార♦తులుబాడ మెడలోన
గంట నెద్దురుc గట్టు♦కరణి తాళి
యట్టున బిగియించి ♦ యంద ఆనందింప
భోగాళియం దను♦రాగమునను
అతిజాత్య మొనరింప ♦ నర్థాత చేcబూని
నంత మాత్రింబున ♦ నగునె పెండ్లి
తే॥ గీ॥ కాదు కా దోయి మానవా! ♦ కలికివలపు
నిలుపగలిగిన యపుడు పు♦నీతముగను
హృదయమంతయు కోమలి ♦ పదములకును
నర్పణముజేయు నది వివా♦హంబు నరుడ!

అర్జునుడు

దేవీ! నిశ్చయము. ఇప్పటికి గ్రహింపగలిగితిని. నీపాదసాక్షిగా తన్నటులనే మెలంగెదను. నన్ను క్షమించుము. ఇదివర కే మీమియోగా బ్రాంచితిని. ఇప్పుడు నీప్రబోధమువలన విజ్ఞానోపార్జితుండనైతిని.

తే॥ గీ॥ సాంఘికవుc జర్యలంచు నా♦చార మంచు
వేదవిధి యంచుc బౌరాణ♦విధ మటంచుc
బలుకు లోకుల మాటలc ♦ బాటిజేసి
పడితి నవివేకమున నేను ♦ పడతిమిన్న!

మోహిని

చాలు, చాలు! నీమాయావినయంబులు! ఎన్నటికిని నీజాతి స్వభావము బోదు. ఇన్నివంటకట్టియల నరికి, యీామురికిగుడ్డల నన్నిటిని

యేకాదశాక్షౌహిణిని మాపిన కరంబు
మఱికి గుడ్డల గుంజు నరణి కమరె;
యమరభోగంబుల నందిన నెమ్మేను
యతివ పాదాహతి నందవలసె;
తే॥ గీ॥ నెన్నడో వాసుదేవు నాక్షేపణంబు
జేయ దైవంబు నా కిటు జేసె గాన
యనుభవించుచు నుంటి నా యఘము నిపుడు
దైవదూషణ మిల నసాధ్యంబుగాదె.

నిరంతరకృతానేకపరోపకారు డగు బాంధవుని నిష్కారణము దూషించిన పాతక మూరకబోవునా ? ఆహా ! నారదా ! యెంతపని జేసితివి ? నీవలుకులు విశ్వసించినమూలమున గదా ! యిన్నిపాటులు ! యింక నిన్ననున దే మున్నది ? నీజీవనమే యిది. (ఆలోచించి) కృష్ణా! లోకత్రాణపరాయణా ! పార్థసారథీ ! పాండవపక్షా ! పుండరీకాక్షా ! నీ వింక నిగ్రహింప మేము నిలఁబడగలమా ! అనుగ్రహమునకు పాత్రులముగాని, యాగ్రహమునకు పాత్రులమా? ధార్తరాష్ట్రకల్పితవ్యూహనిర్మూలనమేగాక సకలశాత్రవనిర్మూలనోత్సాహంబునను ధర్మరాజసింహాసనప్రాప్తినంతో పాతిశయమునను, మనను మనసులో లేక పోరపాటున నిందించితిని. ప్రాణమిత్రుండవు, ప్రాణరక్షకుడవైన నీవే నన్ను రక్షింపకున్న, యన్యులా నన్ను రక్షించువారు ? బావా! మహానుభావా! అపరాధిని. క్షమించుము. దాసుడను, కృష్ణా! ఆపదోద్ధారకా! శరణు శరణు! రక్ష మాం, రక్ష మాం (అని చేతులు భూమిమీదనుంచి
గ మునిచి, పాహి మాం, పాహి మాం అని పరవశమున
ండ జయంతరూపమున నారదుడు మనోవేగముతో
చి దిగి గుజ్జముప్రక్కన విడచి, పడియున్న యర్జు

జయంతుడు

౧. భయపడకుము. లెమ్ము, లెమ్ము.

మవా? పురుషుండ నని విలాసములు దిద్దుదువా? అదుగో ఆకర వాలంబుచే పరపర గొరిగించెదను. జాగ్రత! స్త్రీలు బానిస లనియా విూపురుషుల యభిప్రాయము. యూరుగాయ లనియా నీయుద్దేశ్యము. మూగవాడవా?

సీ॥ హితులు బాంధవపురో•హితులు బంధులు మిత్ర
తతుల మధ్యను మహా•తంత్రములను
జెలులు మంగళహార•తులుబాడ మెడలోన
గంట నెద్దురుఁ గట్టు•కరణి తాళి
యట్టున బిగియించి • యంద ఆనందింప
భోగాళియం దను•రాగమునను
అతిజాత్యమునరి౽వ • నర్హత చేఁబూని
నంత మాత్రంబున • నగునె పెండ్లి
తే॥ గీ॥ కాదు కా దోయి మానవా! • కలికివలపు
నిలుపగలిగిన యపుడు పు•నీతముగను
హృదయమంతియు కోమలి • పదములకును
నర్పణముజేయు నది వివా•హంబు నరుడ!

అర్జునుడు

దేవీ! నిశ్చయము. ఇప్పటికి గ్రహింపగలిగితిని. నీపాదసాక్షిగా తేటులనే మెలంగెదను. నన్ను క్షమించుము. ఇదివర కే మేమియోగా జించితిని. ఇప్పుడు నీప్రబోధమువలన విజ్ఞానోపార్జితుండనైతిని.

తే॥ గీ॥ సాంఘికవుఁ జర్యలంచు నా•చార మంచు
వేదవిధి యంచుఁ గా రాణ•విధ మటంచుఁ
బలుకు లోకుల మాటలఁ • బాటిజేసి
పడితి నవివేకమున నేను • పడతిమిన్న!

మోహిని

చాలు, చాలు! నీమాయావినయంబులు! ఎన్నటికిని నీజాతి స్వము బోదు. ఇన్నివంటకట్టియల నరికి, యిూమురికిగుడ్డల నన్నిటిని

యేకాదశాక్షౌహిణిని మాపిన కరంబు
మురికి గుడ్డల గుంజు • నరణి కమరె;
యమరభోగంబుల • నందిన నెమ్మేను
యతివ పాదాహతి • నందవలసె;
తే॥ గీ॥ నెన్నడో వాసుదేవు నా • క్షేపణంబు
జేయ దైవంబు నా కిటు • జేసె గాన
యనుభవించుచు నుంటి నా • యఘము నివుడు
దైవదూషణ మిల నసా • ధ్యంబుగాదె.

నిరంతరకృతానేకపరోపకారు డగు బాంధవుని నిష్కారణము దూషించిన పాతక మూరకబోవునా? ఆహా! నారదా! యెంతపని జేసితివి? నీవలుతులు విశ్వసించినమూలమున గదా! యిన్నిపాటులు! యింక నిన్ననున దే మున్నది? నీజీవనమే యది. (ఆలోచించి) కృష్ణా! లోకత్రాణపరాయణా! పార్థసారథీ! పాండవపక్షా! పుండరీకాక్షా! నీ వింక నిగ్రహింప మేము నిలువగలమా! అనుగ్రహమునకు పాత్రులముగాని, యాగ్రహమునకు పాత్రులమా? ధార్తరాష్ట్రకల్పితవ్యూహ నిర్మూలనమేగాక సకలశాత్రవనిర్మూలనోత్సాహంబునను ధర్మరాజసింహా. సనప్రిపినంతో పాతిశయమునను, మనసు మనసులో లేక పోరపాటున నిందించితిని. ప్రాణమిత్రుండవు, ప్రాణరక్షకుడవైన నీవే నన్ను రక్షింప కున్న, యన్యులా నన్ను రక్షించువారు? బావా! మహానుభావా! అపరాధిని. క్షమించుము. దాసుడను, కృష్ణా! ఆపదోద్ధారకా! శరణు శరణు! రక్ష మాం, రక్ష మాం (అని చేతులు భూమిమీదనుంచి ...గ ముంచి, పాహి మాం, పాహి మాం అని పరవశమున ...ండ జయంతరూపమున నారదుడు మనోవేగముతో ...చి దిగి గుఱ్ఱముప్రక్కన విడచి, పడియున్న యర్జు

జయంతుడు

౧. భయపడకుము. లెమ్ము, లెమ్ము.

అర్జునుడు

(అంజలి బద్ధుడై లేచి కన్నులు దెరువకయే) కృష్ణా! ఆపద్బాంధవా! యింతకాలమునుండి యాపదయందు దగిలి యల్లాడుచున్న నన్ను మన్నించి యిప్పటికా నీ వనుగ్రహించునది? మహానుభావా! అపరాధిని మన్నించుము. ఇవే పదివేలవందనములు.

జయంతుడు

సోదరా! ఇది యేమి? యిట్లనుచుంటివి? నేను శ్రీకృష్ణుడను గాను, దివిజపతియైన దేవేంద్రుని పుత్రుడను, జయంతుడను. అయ్యో! పార్థా! నీరాజసం బెందుపోయినది? నీతేజం బెందుడాగినది? ఈ మురికిగుడ్డ లేమి? యీవాలకమేమి? ఈ యాడువారలచీర లేమి? యింత చిక్కి శల్యావశిష్టుండవై యుంటి వేల?

అర్జునుడు

(ఆలోచనగా) సోదరా, సోదరా, జయంతా! ఏ మని వచింతును? దివ్యకులోద్భవుండ వగు నీకు దెలియని దే మున్నది? మన యగ్రజుండగు ధర్మజుని దర్బారునం దుండగ నిరువు రైంద్రజాలికు లరుదెంచి (జయంతుడు త్వరత్వరగా ఆ ఆ అని అనుచుండును) వృకోదరు దర్వీకరగ్రస్తుని జేసి, న న్నొక్కమాయాతురంగముపై నెక్కించి యిట కరిగెను. అంతట నేను ఆ కనకసౌధమందలి దానవాంగన మాయా వాగురులలో జిక్కి పరిణయమాడి సుతపంచకంబును గాంచి దా పడరాని పాటులు బడి, వినరాని మాటలు వినుచు నీస్థితి నుంటిని యిం కే మని వచింతును, అబ్బా! తలుచుకొన్న గుం చున్నవి.

చ॥ తడవులకొంత మూని వని॰తాతతి చెంత
గడువుచు పద్మసౌరభము॰గానని ద
పడతుల నర్మగర్భకృత ॰ భావ
జడమతినై చరించితి ని॰జా

మో హి ని

నిరంతర హరిచరణారవింద భజనానందా, నారదమౌనీంద్రా! వందనములు. నేటికిగదా నాపై దయగలిగినది. ఎంతకాలమైనది మీ దివ్యదర్శనము లభించి? మహానుభావా! యిం కెంతకాల మోర్చుకొనవలయును?

ఉ॥ పార్థు డొనంగుశాపవిధి • బాల్పడి దున్సహమైన గాని నా
స్వార్థధనంబుగా దలచి • సర్వశ్రమ ల్భరియించి మించి యా
పార్థునిగూడి నేడు సుత•పంచకముఁ గని శాపమోక్ష కృ
తార్థిని నైన నన్ను వెన•బంపుము నాకము కింక తాపసా!

(అని నమస్కరించును)

నా ర దు డు

త్రిజగన్మోహినీ, యూర్వశీ! అది నావలన కావలసిన కార్యము గాదు. పూర్వస్మృతియున్న నీ కేల యింత యాతురత? ఇంక నీవలన కొన్నిదైవకార్యములు గావలసియున్నవి. జగద్రక్షకుండైన శ్రీకృష్ణవరమాత్మునిలీలలకు దోహదముగా నీ శిశుపంచకంబులో నింద్రప్రస్థపురంబున కరిగిన నరభీముల గర్వములతో బాటు నీశాపవిమోచనమును జరుగును. మిగిలిన యభిమానులను పరీక్షించవలయును. కాన నీవు భీషణధ్వానభయానకరూక్షవేష భాషణంబులతో తీవ్రముగా నింద్రప్రస్థపురము నకురమ్ము. నిన్ను శ్రీకృష్ణపరమాత్మ ననుమతిని భీమసేను డంబరవీధి కెగురవేయును. శాపవిమోచనకారి వగుచు అర్జునునితో బాటుండజాలను నీశాపావధిని దెల్పి నాకలోకంబున కరిగెదవు. వత్వరంబున పార్థుని వెంట బొమ్ము. (మోహిని బాలురతో నారదునకు నమస్కరించి నిష్క్రమించును.) భగవదాజ్ఞానుసారముగా నే నీ కపటనాటకమునం దింతవరకు నాపాత్రోచితకథల నిర్వర్తింపగలిగితిని. ఇంక యింద్రప్రస్థపురంబున కరిగి భీమసేను డెట్లు మెలంగునో అర్జును డేమి యొనర్చునో వీక్షించెదగాక! జగన్నాటకసూత్రధారుని చైదము లనంతములుగదా కృష్ణా, యశోదానందనా! ఏమి నీవఙ్ఞావిశేషంబులు!

సోదరా! ప్రపంచమునం దింతకన్న సమానుమశా
మర్త్యకక్షత్రియు డాచరించియుండడు. ఇది విని సహింపజాం
ఇప్పుడు నే నన్నివిధంబుల దిక్కుమాలినవాడనైతినిగదా! అయ్యో...

జయంతుడు

కిరీటి! గతజలసేతుబంధనమునకు వగవకుము. ఎంతటివారికిగాని పూర్వజన్మకృతఫలనంచయ మనుభవింపక తప్పదు. నీకు జరిగినట్లే నేనును అట్టిగారడీలమాయలలో జిక్కియే యిట కరుదెంచితిని. అదుగో హయము. నేను దివ్యజుడను గనుక నాకు సర్వగమనశక్తి గలదు. ఆ రాక్షసాంగన మనలను వీక్షింపక మునుపే నీ హయంబుపై నీపురంబున కరుగుము.

అర్జునుడు

(స్వగతము) ఇదిగూడ గారడీమహిమగాదుగదా! మరల యే ద్వీపమున నెట్లు కష్టపడవలయునో? అది యంతయు శ్రీకృష్ణభగవానునిదయ యెటులగా నున్న అటు లగును. ఇప్పుడు నే నెట్లులైనను తెగువనే వహింపవలయును. (అటువైపు గాంచి) సోదరా! జయంతా! ఆ రాక్షసి మనలను జూచి రౌద్రంబున రోషభీషణాకారియై నిటు లరుదెంచుచున్నది. అది రాకమునుపే మన మిరువురమును ఈహయంబుపై బోవుదము. ఆరాక్షసాంగన బహుదెగవరి. కరిబలాఢ్య. మాయావి. నిన్ను విడచి నాకు బోవ మన సొప్పకున్నది.

జయంతుడు

పార్థా! వచ్చుచున్నది, వచ్చుచున్నది. హయ మెక్కి పొమ్ము, పొమ్ము, నాకు భయము లేదు. (అని అనుచుండగనే మోహిని వురికి వచ్చుచుండును. అర్జునుడు హయము నెక్కి మాయమగును. జయంతుని పై మోహిని పడబోవునమయమున జయంతుడు నారదుడై నిలిచి) ఊర్వశీ! పూర్వస్మృతి దెచ్చుకొని శాంతింపుము.

అని జరాసంధుని • ననిలాత్మజునిచేతఁ
జీల్పించితివి జూడఁ • జీలికలుగ
ధరణీకుమారుని • ధైర్యబలంబులు
పడద్రోసితివి సత్య•భామచేత
పితాజ్ఞ పాలించు • భీష్ము నాలములోన
జంపించితివి పార్థు • శక్తిచేత
ద్రుపదాత్మజునిచేత • ద్రోణుని కురుభూమి
సమయించితివి మనో•శక్తి మెరయ

తే॥ గీ॥ నెందు కీకృత్యము లెవ్వన • నెరపినావొ
నీకు నీవే యెఱుంగుదు • నీరజాక్ష!
శత్రుమిత్రుల నొకరీతి • జరుపగలవు
యఖిలకల్యాణగుణసాంద్ర, • యాదవేంద్ర!
(నిష్క్రమించును)

## తృతీయ రంగము

### మయసభ

(పంచపాండవులు, శ్రీకృష్ణనారదులు, విదురవ్యాసులు, వృషకేతుమేఘవర్ణులు, ద్రౌపదీసుభద్రలు, రుక్మిణీసత్యభామలు, మరికొందఱు సందర్భానుసారముగా పురజనులు ప్రవేశింతురు.)

### శ్రీకృష్ణుడు

నారదమునీంద్రా! అశ్వనీదేవత లరుదెంచుట కేల నింత యాలస్యము?

### అశ్వనీదేవతలు

(అంతరిక్షమున అదృశ్యరూపములతో) నారాయణస్వరూపుండవగు నో వాసుదేవా! మా వలన కావలసిన కార్యంబు లాజ్ఞాపింపుడు సత్వరము నెరవేర్ప సంసిద్ధులమై యుంటిమి. (ధర్మరాజు నకులసహదేవులు పైకిలేచి నమస్కరింతురు)

శ్రీకృష్ణుడు

ఉరగవిషబాధచే బీడింపబడు నీ భీమసేనుని సేదదేర్పుడు.

అశ్వనీ దేవతలు

మహాప్రసాదము. (అని నీలవర్ణపుష్పములు పైనుండి భీమునిపై ల్లుదురు. వెంటనే భీమసేనుడు తొంటి జవసత్వములతో లేచి సంతోషిత పులకితగాత్రుడై సభారంగము నొక్కపరి తిలకించి కృష్ణునికి నమస్కరింపుచు అంజలిబద్ధుడై)

భీమసేనుడు

బావా, మహానుభావా!

సీ॥ భగవంతుడ వటంచుఁ ♦ బ్రార్థించితిమి గాని
పగ భీరుడ వటంచుఁ ♦ బలుకలేదు
చెలికాడ వీ వంచుఁ ♦ జెప్పుకొంటిమి గాని
చిలిపి వటంచు వ♦చింప లేదు
బంధుడవని యెంతో ♦ బ్రతిమాలితిమి గాని
నారీవిధేయు డ♦నంగలేదు
విజయసారధి వంచు ♦ వేడుచుంటిమి గాని
చెనటి క్రోడితి వంచు♦జెప్పలేదు.
తే॥ గీ॥ ఎన్న డెటువంటి పలుకుల ♦ నెరుగ నిట్టి
మమ్ము బాధింప నెంచుట ♦ మగటి మగునె?
పరగ శరణాగతుడ వన్న ♦ బిరుదు లేదె?
శ్రీయుతాకార, శ్రీరమా♦చిత్తచోర!

(పైనుండి దేవతానినాదములు వినిపించుచుండును. ఇంతలో అర్జును డట కరుదెంచును. అంద అత్యంతాశ్చర్యమున వానిని జూచుచుందురు.)

శ్రీకృష్ణుడు

కురు సంగ్రామ విశ్రమోపార్జితజయా! విజయా!

తే॥ గీ॥ హయము వడి నెక్కి వడిన్వడి • యంతరిక్ష
గమనమున బోతివట నేమి•గాదలంచి
యిల్లనక పంచవర్షము • లెలమి జరిగె
నెచట నుంటివి? పార్థ మా•కెరుగ జెపుమ.

అర్జునుడు

బావా, మహానుభావా!

మ॥ చతురంభోధిపరీతమైన ధరణీ • సర్వంబు మున్ రాట్సుత
ప్రతతి న్గాంచిన వేడుక న్మరల సం•భావించి నీయశ్వ మె
క్కి—తి నంత న్వడి భూప్రదక్షిణకి•యన్ • కేయూతగా బోయి సం
తతము న్గన్గొని వచ్చుచుంటిని సమ•స్తాశావకాశంబులన్.

మే మొనర్పబోవు హయమేధము నరికట్టగల సమర్థు లెందునైన గలరో యని. నా కెచ్చటను నట్టివారు మచ్చున కేని గాన్పింపరైరి. (అంతరిక్షమున యమరులకోలాహలము. శ్రీకృష్ణనారదు లొకరి నొకరు జూచుకొని నవ్వుకొనుచుందురు.)

ధర్మరాజు

(ఆలోచనగా తనలో) ఈ మహానుభావులు మరొకతీరుగా గాన్పించుచున్నారు, వీరి ముసిముసి నవ్వుల కేదియో కారణ ముండి తీరును.

భీమసేనుడు

సోదరా, అర్జునా!
క౦॥ అలనాడు తీర్థయాత్రలు
సలుపుచు జూడంగలేదె? • సర్వధరిత్రిన్
గల నృపుల శౌర్య మంతయు
నలలితసుగుణేంద్ర! నేటి • నరణి యిదేలా?

శ్రీకృష్ణుడు

(నారదునితో) భీమసేనుం డడుగదగిన ప్రశ్నయే యడిగెను. అర్జునుం డేమి సమాధానము నిచ్చునో?

నారదుడు

మహానుభావా! యేమియు దెలియనటుల నన్ను పృచ్ఛించెదవు నీకు దెలియనిది నాకు దెలియునా?

అర్జునుడు

(తనలో) మా భీమసేనుడు యూపిరి దిరుగని మాటల నడుగుచున్నాడే! అయిన నిట్లనియెద గాక, (ప్రకాశముగ) సోదరా, భీమసేనా!

తే॥ గీ॥ తీర్థయాత్రల సమయాన • దేటపడగఁ
గనుట కవకాశ మింతైనఁ • గల్గుగ మునికి
జూచి వచ్చితి నిప్పుడు • శోధగరిమ
ధరణి గల సర్వ మెల్ల స•మీరవృత్తి!

సహదేవుడు

చ॥ ఉరగవిషాగ్నికీలలకు • నుర్వి విపద్దశ నొందుచున్న నీ
కరువలిసూనుని న్విడిచి • కాగల కార్యము లెన్నొ ముందటన్
వరలుచునుండ నీ వటుల • భావన జేసియు బల్క బాడె? యో
నర! పరు లీ విధంబు విన • నవ్వరె? లోకము నింతగానవే!

నారదుడు

సహదేవా! ఉత్సాహభరితహృదయాంతరంగులకు నూహాలు దలుగుచు సమయస్ఫూర్తి, సమగ్రత లోపించి బుద్ధిసూక్ష్మత నశించును.

ఉ॥ ఎన్నడు జూడ నట్టి హాయి • మెక్కు లభించె నటంచు నెంచి నీ
యన్న దలంచి భూమి గల • యట్టి విచిత్రము లెన్నొ గాంచ ను
త్పన్నకుతూహలంబు పయి • బట్టదు యున్న ప్రశంస; గాన నీ
పిన్నమనంబు నందు దల • పెన్నవు నీ తల పేమొ? బాలకా!

శ్రీకృష్ణుడు

మ॥ అదిగో దో మునిసార్వభౌమ! మన మ•స్వాధీనమై యుండినన్
గదియన్ రాకను సోదరాళి విడి ని•క్కం బంచు మాయాహాయం

ఔదిరో జిక్కగ దానిపై నరుగ మేలే యంచు నూహించి యీ
నదయుం డీ గతి జేసె గాని యిక నీ సందేహ మింకెందుకో!

సహదేవుడు

బావా, వాసుదేవా!! అదియును గాక సీతని వలుకుల వైఖరియు ముఖలక్షణంబులును, నుపలక్షింప సీత జేదిరో యాపదనుండి తప్పించుకొని వచ్చినటుల నామనంబునకు పొడకట్టెడిని. సోదరా, అర్జునా! అంతియేగ...

ధర్మరాజు

(చేతితో సహదేవుని టక్కున నాపి, వినుట నభినయించి) జీమూతగర్జనసన్నిభం బగు నీ ప్రళయకాలోత్పన్న భయంకరారావం బెక్కడిది? (ఎదుట పరికించి) ఆబాలురెచ్చటి వారలు? యీ దేవతాకారిణి యగు నీ నాతి యెవ్వతె? (అంద ఱటు జూచుచుందురు. శ్రీకృష్ణనారదులు నవ్వుకొనుచుందురు. భీముడు శ్రీకృష్ణనారదుల వద్దకు వచ్చి యేదియో మాటలాడ బోవును. ఇతరులు ఆశ్చర్యమున జూచుచుందురు. అప్పుడు మోహిని సభారంగమున ప్రవేశించి అర్జునుని చేతిని గట్టిగా బట్టుకొని కోపముతో)

మోహిని

పంచచామరము

జంఝూటిరాగము – త్రిశ్రగతి.

అరే! నరాధమా! సుతాళి । నన్ను లంకలోపలన్
బిరాన వీడి సోదరాళి । బ్రేమ జేరినాడవే!
కిరాతబుద్ధితోడ నిట్లు । కీడు మూడజేతువా!
త్వరాగ రమ్ము పోద మింక । వారిరాశి జేరగన్.

సాగరతుల్యంబైన సంసార సాగరభారమునందు నన్ను ము దొంగతనముగా మరల నీ రాజ్యంబునకు నీ వరుదెంచి ననీతి బాధలు బెట్ట దలంచితివా? ఆ నాడే మని ప్రతిజ్ఞ జేసితివో? జ్ఞప్తికి దె

కొనుము. మన కిరువురకును జన్మించిన ప్రథమకుమారునకే రాజ్య సామ్రాజ్యపట్టాభిషేకం బొనర్చెద నని పవిత్రం బగు మహోదధిం జేసిన ప్రతిజ్ఞ మరచి నోరెరుంగని యీ పసిబాలుర విడిచి పరుగిడి రా నీ మనం బెట్లొర్చెను? నీ హృదయము పాషాణనిర్మితమా? ధర్మజుని సోదరుండ నని బల్కితివే? చేపట్టిన ధర్మపత్నుల విడనాడుటయే మీ రాజ కుల ధర్మమా? ఎంత కఠినుడై నను కడుపార కన్నబిడ్డల విడుచునా? అంత వైరాగ్యపరుండ వైనచో నాతోడ నేల మాటాడకపోతివి? సమయ మైనప్పుడు మన మిరువురము గలిసి కరిపురమునకు బోవుద మనియు, నిన్ను రాజ్యసుఖాద్యుత్తమభోగంబుల ననమానురాలను గా జేతు ననియు, ప్రమాణ మొనరించితివే? ఈ మ్రుచ్చదన మెచ్చట నేర్చుకొంటివి? సముద్రమధ్యద్వీపమున విడిచిపోయిన యీ తరుణి-వీడ వదలిపోవు నని దలంచి ఈ కాంత సముద్రముమీద లేవాదని యెంచి చిరసహవాసము జేసియు కప్ప పద్మసౌరభము గ్రహింపజాలనట్లు నీవు నా సామర్థ్యము దెలిసికొనలేకపోతివే? నాడు రహస్యముగా సాగర మధ్యంబు నదంలి ద్వీపమునందు గల సౌధాంతర్భాగంబున నిర్మానుష్య ప్రదేశంబునందున నా పదతాడనంబు లనుభవించుట గాదు. ఇప్పుడీ సకలజనమధ్యంబున నీకు నా వామపాదహతులు దప్పవు; రమ్ము. లంకకు పోవుదము. కాదంటివేని యిప్పుడే నీవని బట్టెదను చూడుము. (అని చేయి బట్టి లాగుచుండగా నకులు డది విడదీయ బోగా వానిని, ఆపై దళవృష కేతుని, పైన మేఘవర్ణుని, పిమ్మట సహదేవుని వెనుకకు బడద్రోయును. భీముడు లేవ నుంకించుచుండగా శ్రీకృష్ణుడు వారించి అర్జునని కిక్కుమొగంబై)

శ్రీకృష్ణుడు

సీ॥ భళి! భళి! పార్థ! యేమనుచు • బల్కితి వీవు సభాస్థలిక ముదం
బలరగ సర్వరాజ్యముల • బాడుచు నాడుచు జూడబోయి నీ
మ॥ అదిరికిని బెండ్లియాడి నిజ•కారణము న్దెలియంగ నీవు యీ
గదియ్యతిని జూచి సర్వనృప•పుంజము నివ్వెలి సేయదే నృపా!

నారదుడు

చ॥ పరిణయమాడి, తన్నిటుల • బాయుగ న్యాయమటంచు నెంచి, యీ
చిరుతల వీడి, సోదరుల • జేరితి నింక. మ రేమటంచు నీ
తెరగున నన్నృతంబులను • దెల్పియు మోనమొనర్ప బాడియే!
తరుణికి నేమి దెల్పుదువొ • తప్పక బల్కుము శ్వేతవాహనా!

(వృషకేతునకులసహదేవమేఘవర్ణులు చులుపుకొనుచు లేతురు. వృషకేతుడు సాలోచనముగా లేచి శ్రీకృష్ణనారదులతో)

వృషకేతుడు

మహానుభావులారా! ధర్మాధర్మనిర్ణయం బొనర్పవలెగాని నిర్హేతుకముగా వ్యంగ్యోక్తులతో నిష్ఠురాలాపములం బల్కి మా మానసముల నొప్పించి యిందఱిలో నింత పరాభవము జేయనేల? జగన్నాటకసూత్రధారి వగు నీకు దెలియని దే మున్నది. స్త్రీచాపల్యంబున తల్లి యిటు బల్కుచున్నది. గాని ఆలోచించిన యెడల తండ్రిగారి యందు దోసమే మున్నది? (మోహిని హుంకరించుచు వృషకేతు జూచును. అందఱాశ్చర్యముగా గగనోర్వులు జూచుచుందురు.)

నారదుడు

రాధేయనందనా! ధర్మమున కర్జునుండు, మిగిలిన మీతండ్రులు నొప్పుకొనవలయును గదా! పార్థుడు జేసిన ప్రతిన నిశ్చయమో యనిశ్చయమో మొదలు తెలిసికొనవలయును. ధర్మజు డందుల కంగీకరించినఁ గదా! భీమసేనుడు మున్నగు వీరులు సహింపవలయు. అప్పుడు మన ధర్మాధర్మనిర్ణయము.

ధర్మరాజు

వాసుదేవా! యిది యంతయు కడుంగడు నద్భుతముగా నున్న ఈ ధర్మమును సాంగోపాంగముగా నీవు పరిష్కరించవలయును. తర్కోక్తులు నిర్ధారణ మొనరింప నసమర్థులు. ఈ బాలకు లిప్పుడే కార్యము లొనర్చుచుండిరి. ముందేమి జేయుదురో గదా? (శ

సుందరాంగులు సుకుమారులు సభలో నందమైన యున్న తానసములపై నున్నవారల పక్కన నిలుచుచుందురు.)

భీ మ సే ను డు

మాధవా! ఆపద్బాంధవా! యెందుల కింక మమ్ము బరీక్షించె దవు? యిప్పటికే గాగల కార్యంబులన్నియు సంపూర్తి యైనవి. ఈ నలుగురిలో నింతవరకై నది జాలును. యింక తమ నిగ్రహము లుపసం హరించుకొని దయ జిల్కుడు. దేవా! మహానుభావా!

సీ॥ తొలి తులాభారంబు • వెలయంగ జేసి దా
తెలియని రీతి నుం•డిన దెవండు
పారిజాతసెపంబు • పరికించి జెల్లెండ్రి
పరువు దీయగలంత • పాత్రు డెవడు
శాల్యన్నమున మన•సార తృప్తుల జేసి
ద్రౌపది గర్వంబు • బాపె నెవడు
కంకణబద్ధాంత్య • కామ్యంబు లూడ్పించి
మరి మూర్ఖతను నెద • మాన్పె నెవడు
తే॥ గీ॥ అట్టి లోకైకవసుడు యం•బ్జాతసుతుడు
నెలమి నీ భీమపార్థుల • నిందు గర్వ
మూడదీయంగ దలపట్టి • మోదమునను
గారడీవిధి వచ్చె నో • కమలనాథ!

(అని కృష్ణునిచేతులు బట్టుకొని ఆ చేతులలో తన శిరముంచును)

అ ర్జు ను డు

(అదాటుగానున్న మోహినిని విడిపించుకొని అంజలిబద్ధుడై పదముల బడుచు)

తే॥ గీ॥ నెలమి పదమూడు వత్సరా • లింపుతోడ
శ్రమల గొనుచున్న మము గృప • స్వాంతముగను
రాజ్యరమ గూర్చి మా కను•రాగ మిచ్చి
బ్రోవ, విడి దూరితి క్షమించు • దేవదేవ!

(అని కృష్ణుని చరణములపై బడి నమస్కరించును.)

శ్రీ కృ ష్ణు డు

త్రిజగన్మోహినీ! మోహినీ! "మగని తోడిది లోకంబు మానవతి" కనునట్లు యర్జును ననుసరించి నీ వుండుట కేల నందేహించెదవు (అని దెల్పుచుండగా వ్యాసుడు నిలువబడును. అందఱు నగౌరవముగా నిలుతురు. వ్యాసుడు గూర్చుండ చేసంజ్ఞ జేయును.)

వ్యా సు డు

ఆర్తత్రాణపరాయణా! నారాయణా! యింక దివ్యుల నొప్పించుట మన కర్తవ్యకృత్యము గాదు (మోహినిని జూపి) యింక త్రివిష్టపంబున కంపుట కాలనస్యమే మున్నది. యర్జును డొనర్చిన ప్రతిజ్ఞకు భగవానుడైన శుకోపదేశమే ధర్మసిద్ధాంతము. యింక మీరా రన్యాలోచనముల నూహింప జనదు.

శ్రీ కృ ష్ణు డు

తమ్ముల భార మన్న తగ్గింపవలయు; నన్న యాజ్ఞ తమ్ములు శిరసా వహింపవలయు. సాత్యవతేయా! మధ్యపై త్తనము మనకేల?

వి దు రు డు

కం॥ సురుచిర సంతోషణములు
పరిపోషిత వేదరత్న • బంధురతరముల్
సరసుల హృదయాంబుజ భా
స్కరములు నీ లీల లరయ • కల్యాణనిధీ!

తే॥ గీ॥ అట్టి నీ లీలలను విచక్షణము జేసి
ధర్మములు గా వటించును దలచు వారు
గలరె? యో పుండరీకాక్ష! కలుషహారణ!
దీనమందార, శ్రీ వాసుదేవ, దేవ !

నారదుడు

మహానుభావా ! వాసుదేవా ! యిందరిలోనైన యీ నాటకము జాలును. యింక నాలస్యం బొనరించిన నాటకంబున కంతరాయంబు వాటిల్లును. ఊర్వశీశాపవిమోచనము గావలయును గదా ! (అందఱును వెల్లబోవుదురు. పై నుండి నవ్వుధ్వనులు వినబడును.)

మోహిని

మీర లంద ఱొక్క శ్రేణిలోనివారు గాదా ! నా మాట నేల పాటింతురు? పార్థా ! నాతో వచ్చెదవా ? లేక నాపా... (అని పోబోవు చుండగా శ్రీకృష్ణుడు భీముని వంక జూచుచు పైకి తన చేతులతో సైగ జేయుచు భీముని చెవులో నేదియో దెల్పును.)

శ్రీకృష్ణుడు

భీమసేనా ! యింకనూ మే మీ యవమానము నెంతవరకు సహింపవలెను ?

భీమసేనుడు

శాంతించిన కొలదిని నీ చాపల్యము మేర మీరుచున్నదే? తాక గూడదని యుపేక్షించినను నీ వింక మానవా ? నారీపిశాచీ! (అని పట్టు కొని బలముగా పైకెగుర వేయును. యూర్వశి పైనే నిలుచుచుండును)

శ్రీకృష్ణుడు

ఊర్వశీ ! సురలోకవిభుడైన దేవేంద్రునకు నందనందన పాండు నందనుల వందనము లందజేయుము. మరువకుము పోయిరమ్ము (ఊర్వశి పైకిబోవుచు) మహామహులారా ! మీకివే పదివేల వందనములు. నా

బాలుర పాలించు భారము మీ యదియే (అని పైకి బోవుచు నీ క్రింది గీతము బాడుచుండ పైనుండి చక్కని మృదంగనిస్వనములు వీణానినాదములు మ్రోగుచుండును. పువ్వులవాన గురియుచుండును.)

ఊర్వశి

కల్యాణిరాగము—రూపకతాళము.

ధన్య మయ్యె నాదు జన్మ । దానవ మదహరణా !
మాన్య నైతి గోపాలా ! । మదనకోటి సుందరా!॥

వరునిశాపవశత నసుర।నాతినై గడు యిడుమ లొందఁగ
బరచితి సవమానముల నీ । బావమరది పార్థు నకట!॥

అది మదిలో నుంచుకొనక । మదనజనక! వదనంబున
కతిముదమున బనిచి నన్ను । పతితపావన! పాలింపుము॥

అర్జునుడు

శ్లో॥ అచింత్య మవ్యక్త మనంత మవ్యయం
విభుం ప్రభుం భావిత భూతభావనమ్
త్రైలోక్యవిస్తార విచారతారకం
హరిం ప్రపన్నోఽస్మి గతిం మహాత్మనామ్

భీమసేనుడు

శ్లో॥ జలౌఘమగ్నా సచరాచరాధరా
విషాణకోట్యాఽఖిల విశ్వమూర్తినా
సముద్ధృతా యేన వరాహరూపిణా
స మే స్వయంభూ ర్భగవా న్ప్రసీదతు.

సహదేవుడు

శ్లో॥ తస్య యజ్ఞవరాహస్య విష్ణో రమితతేజసః
ప్రణామం యేఽపి కుర్వంతి తేషా మపి నమో నమః.

### వృషకేతుడు

శ్లో॥ నాన్యం వదామి న శృణోమి న చింతయామి
నాన్యం స్మరామి న భజామి న చాశ్రయామి
భక్త్యా త్వదీయచరణాంబుజ మాద్రియేఽహం
శ్రీ శ్రీనివాస! పురుషోత్తమ! దేహి దాస్యమ్.

### మేఘవర్ణుడు

శ్లో॥ శ్రీమన్నృసింహవిభవే గరుడధ్వజాయ
తాపత్రయోపశమనాయ భవౌషధాయ
కృష్ణాయ వృశ్చికజలాగ్నిభుజంగరోగ
క్లేశవ్యయాయ హరయే గురవే నమస్తే.

### విదురుడు

శ్లో॥ అహో భాగ్య మహో భాగ్యం నందగోపవ్రజౌకసామ్
యన్మూర్తం పరమానందం పూర్ణబ్రహ్మ సనాతనమ్.

### వ్యాసుడు

శ్లో॥ సా హాని స్తన్మహచ్ఛిద్రం స మోహ స్సా చ మూకతా
యన్ముహూర్తం క్షణం వాఽపి వాసుదేవో న చింత్యతే.

### ధర్మరాజు

శ్లో॥ మేఘశ్యామం పీతకౌశేయవాసం
శ్రీవత్సాంకం కౌస్తుభోద్భాసితాంగమ్
పుణ్యోపేతం పుండరీకాయతాక్షమ్
విష్ణుం వందే సర్వలోకైకనాథమ్.

### కుంతి

స్వకర్మఫలనిర్దిష్టామ్ యాం యాం యోనిం వ్రజామ్యహమ్
తస్యాం తస్యాం హృషీకేశ! త్వయిభక్తి ర్దృఢాఽస్తు మే.

ద్రౌ ప ది

శ్లో॥ కీటేషు పక్షిషు మృగేషు సరీసృపేషు
రక్షఃపిశాచమనుజే ష్వపి యత్ర యత్ర
జాతస్య మే భవతు కేశవ! త్వత్ప్రసాదా
త్త్వయ్యేవ భక్తి రచలా ఽవ్యభిచారిణీ చ.

సు భ ద్ర

శ్లో॥ ఏకోఽపి కృష్ణస్య కృతః ప్రణామో దశాశ్వమేధస్యఫలేన తుల్యః
దశాశ్వమేధీ పున రేతి జన్మ కృష్ణప్రణామో న పున ర్భవాయ.

శ్రీ కృ ష్ణు డు

పాండవులారా! యింక నేమొనర్పవలయును?

ధ ర్మ రా జు

మహాత్మా! దేవరదలంచిన నీయరాని దేమున్నది?

సీ॥ కరువలి సూనుండు • యురగ విషాగ్నిలో
బడి భవత్కృపచేత • బ్రతుకగలిగె
నెటు జోయె నన్న జెంప్పెడివారు లేకున్న
గతినున్న పార్థుడే • కరుణ వచ్చె
ననుజ వియోగ శాంధను గన్న మాకెల్లు
మోదంబు ననుగూడి • మురియగలిగె
ధనపిశాచము బట్టిందడయుక మిముదూరు
వారల గర్వంబు • వదలిపోయె

ఆ॥ వె॥ సకలశుభములెల్ల • సదయ నీదయచేత
గంటిమయ్య నేడు • కలుషహరణ
దురితసంఘ మెల్ల • దొలగిపోయెను దేవ
శిష్టకలుషహరణ, • శ్రీనివాస!

నారదుడు

ధర్మజా! నిశ్చయము, అయినను భగవానుడైన శ్రీమన్నారాయణుడు మీయందు సంపూర్ణప్రసన్నత జెందెనుగాన మీరును, మీకు గావలసిన వరంబుల వేడుకొనుడు.

తే॥ గీ॥ సకలశుభములు మీకు సా • క్షాత్కరించి
దీనతను బాపి నిదుమలం • దీర్చి పిదప
రాజ్యా రమ గూర్చి మీకను • రాగ మిచ్చె
వేడుకొను డింక మన య్యాద • వేంద్రు మీరు.

ధర్మరాజు

ఇందులకు పెద్దలును మావంశోద్ధారకులును, మహాప్రభావసంపన్నులును, తపోనిష్ఠాగరిష్ఠులును, సకలపురాణేతిహాసకథానిర్మాణదక్షులును, నైన వ్యాస భగవానుల గోరుకొనప్రార్థించుచుంటిని.

విదురుడు

తండ్రీ! సాత్యవతేయా! భగవంతుడు ప్రసన్నత జెందినందులకు తామును పాండవేయులపై సంపూర్ణానుగ్రహముంచి వారికి శ్రేయోదాయసాహకములును, ప్రపంచధర్మసహితంబులును నైన విహితంబుల నీమహానుయన్మభావుని వేడ ప్రార్థించుచుంటిని. (అని నమస్కరించును)

వ్యాసుడు

ఆర్తత్రాణపరాయణా, నారాయణా!

సీ॥ ఉపకారమందు నిం • మ్కపటవృత్తివహించి
నిల జనులెల్ల చ • రించుగాత
రాజాజ్ఞ వడసి యం • రాశత కవిబుధుల్
నియత జయశ్రీల • నెగడుగాత
స్వమత సంస్కార సం • వరణమై యనిశంబు
జన మనోహృద్యమై • జరుగుగాత
రాజుల కన్యోన్య • రతిగల్గి మైత్రితో
ప్రజల బిడ్డల సమ • పరచుగాత

ంచమాంకము

తే॥ గీ॥ పాడిపంటల కభివృద్ధి • బరగుగాత!
భరతఖండము నుస్వేచ్ఛ • బడయుగాత!
సకలశుభ మొంది దేశముల్ • జరుగుగాత!
మహిని తారార్క మీగ్రంథ • మలరుగాత!

శ్రీ కృ ష్ణ నా ర దు లు

తథాస్తు. తథాస్తు. తథాస్తు.

వి దు రా దు లు

అభ్యుదయ పరంపరాభివృద్ధిరస్తు. (అని అనుచుండగనే ఆకాశము నుండి సురలు విరుల వాన గురిపించుచుందురు.

ధ ర్మ రా జు

(స్త్రీజనము నుద్దేశించి) కల్యాణులారా! లీలామానుషవిగ్రహుండైన శ్రీమద్వేణుగోపాల కృష్ణమూర్తికి మీరందరొక్కపరి కర్పూరనీరాజనము నర్పుడు.

స్త్రీ ల ం ద రు

మ ం గ ళ హా ర తి.

కల్యాణిరాగము — చతురశ్రగతి.

జయ రాధారమణా
జయ సకలాశ్రితచరణా॥

జయ పాండవ పరిపాలిత
జయసురమునివర వందిత
జయ భాసురవదనాంచిత
జయ హే శుభగాత్ర॥

జై శ్రీ మద్వేణుగోపాల కృష్ణపరమాత్మకు జై

శ్రీ మద్రాధావల్లభో విజయతే.

గద్య

ఇది శ్రీమద్వేణుగోపాలవరప్రసాదలబ్ధ వరసకవితాధురంధర దింటకుర్తి
వంశక్షీరార్ణవరాకాసుధాకర కౌండిన్యసగోత్ర కృష్ణమరాజపౌత్ర
పవిత్రగుణకదంబ గంటమాంబా గర్భశుక్తి ముక్తాఫల
వేంకటప్పలరాజ తనూభవ వినయగుణవిధేయ
విద్యాశేఖర బిరుదాంకిత భాస్కరవర్మ
నామధేయప్రణీతంబైన
శ్రీమద్భారతీయనాటకంబునందు
సర్వంబును సంపూర్ణము.



# విజ్ఞప్తి.

దర సోదరీమణులారా !

వర్తమానప్రపంచమున విద్య కల్పతరువువలె ప్రకాశించు న్నది. విద్యలేని మానవుడు ధముగాను ముందునకు జరుగలేక వుచున్నాడు. మరియు మన నైజాం మహారాష్ట్రమున విద్యావిషయము న మనము పూర్తిగా వెనుకబడియున్నాము. అట్టి కొరంతను సాధ్యమై తలో దీర్చవలయునను సంకల్పముచే భాషాసంసేవనమే ప్రధానముగ ద్దేశించి 'భారతీనికేతన' మను సంస్థను స్థాపించితిమి. భాషాసంసేవనమే ఖ్యముగా నభిలషించి స్థాపించిన మా నికేతనమునుండి క్రమక్రమముగా రాణిక, రాజకీయ, సాంఘిక, ఆర్థిక, చారిత్రాత్మకమైన గ్రంథములు మఖవిజ్ఞులచే రచింపబడి ప్రచురణమగుచుండును. భాషాభిమాను లెల్లరు నవనవలితోల్లాసమగు భారతీయనాటకమును కొని, నికేతనమునందు చందాదారులుగాచేరి మా యుద్యమమునకు తి నొసంగగలరని నమ్ముచున్నాము. ఈగ్రంథ మవసరములేని ం, ముందు ప్రకటింపబడు గ్రంథములు కావలసినయెడల ప్రవేశ ముక్రింద 0-8-0 యెనిమిదణాలు చెల్లించవలెను. భారతీయమును వారు చందాదారులుగ పరిగణింపబడి, ప్రవేశరుసుము చెల్లింప రము లేకయే నికేతనమునుండి వెలువడు గ్రంథములు సగము వెలకే దగలరు. గావున భాషాపోషకులగు ఆంధ్రులెల్లరిందు చందా లుగాం జేరి మా సంకల్పమున కన్నివిధముల తోడ్పడగలందులకు ర్థింపబడుచున్నారు.

ఇట్లు,

తాళ్లూరి వీరరాఘవయ్యాచారి,

భారతీనికేతనము,

బుద్ధవరము,

జోగ్నుకల్ పోష్టు, నైజాం రైల్వే.